# Munivahanudu - Oka Pariseelana

M.Phil; dissertation by : D. S. Basheer
Lecturer in Telugu, Osmania College,
Kurnool - 518C01 (A.P.)

ప్రథమ ముద్రణ : 1995 వేయి ప్రతులు



---

"This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme Aid to Publish Religious Books."

---

వెల : రూ. 25/-

ప్రతులకు :
షా & షా పబ్లికేషన్స్
ప్లాటు నంబరు 29,
మున్సిపల్ ఎంప్లాయీస్ కాలనీ,
కర్నూలు - 518001 (ఆం.ప్ర.)

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1-1-517/బి/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాద్ - 500 380.
ఫోన్ : 7611413.

# అంకితం





నా ఉన్నతిని సదా కోరుకొనే నా తల్లిదండ్రులు

శ్రీమతి పి.యస్. మహబుబ్బీ గార్కి,

శ్రీ. శే. పి.యస్. మహమ్మద్ జాఫర్ సాహెబ్ గార్కి

నమస్సుమాంజలులతో ఈ గ్రంథం అంకితం చేస్తున్నాను.

పి.యస్. బషీర్

డా॥ ఏ. వీరప్రసాదరావు
ఉపన్యాసకులు,
ఆంధ్రభారతి,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం - 515003.

# మునివాహనుడు పరిశోధన అవలోకనం

నాటకం గురించి పరిశోధన చేయటం అంత సులువైంది కాదు. నాటక లక్షణాలు. పరిభాష, ఇతివృత్తం, పాత్రలు, ప్రదర్శనవంటి ప్రాథమిక విశేషాలు తెలిస్తేనే పరిశీలన సులభతరమౌతుంది. విశ్వవిద్యాలయాల్లో సంప్రదాయ, చారిత్రక, సాంఘిక నాటకాల గురించి పరిశోధనలు జరిగాయి. భక్తి సాహిత్యం, అందులోనూ వైష్ణవ సంప్రదాయానికి చెందిన "మునివాహనుడు" వంటి నాటకాన్ని గురించి పరిశోధన చేయటం కష్టసాధ్యం. దీనిని రచించిన ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు ఆంధ్ర పాఠక లోకంలో విశిష్టమైన స్థానాన్ని పొంది ఉన్నారు. ఈ నాటకం నాలుగేళ్ళ పాటు ఇంటర్మీడియేట్ విద్యార్థులు చదివారు. అధ్యాపకులు బోధించారు. అటువంటి నాటకాన్ని గూర్చి పరిశోధన చేయటం, అందర్నీ మెప్పించటం అంత సులభం కాదు. దీన్ని డి.యస్. బషీర్ సాధించాడు. ఉపాధ్యాయ, విద్యార్థిలోకంలో అనేకమైన నూతన ఆలోచనల్ని రేకెత్తించిన ఇలాంటి నాటకాన్ని నా పర్యవేక్షణలో పరిశోధనకు ఎన్నుకొన్న శ్రీ డి.యస్. బషీర్ గార్ని ఎంతైనా అభినందించాలి. నూతన ఉత్సాహంతో కొత్త కోణాల్లో సాంప్రదాయక, పాశ్చాత్య నాటక లక్షణాల అవగాహనతో ఈ నాటకాన్ని అనేక రీతులుగా విశ్లేషించి పరిశోధించటంలో పరిశోధకుని నూతన దృక్పథం కన్పిస్తుంది. సిద్ధం చేసుకొన్న ప్రణాళికనుబట్టి తెలుగు నాటక వైవిధ్యం, రచయిత జీవితదర్శనం, పాశ్చాత్య సాంప్రదాయ నాటక లక్షణాలతో ఇతివృత్త విశ్లేషణం, మత, పాత్ర, రస ప్రదర్శనం, రచయిత దృక్పథం, పరిశోధన ప్రయోజనంవంటి విషయ విపులీకరణంతో ఈ పరిశోధన గ్రంథం రూపుదిద్దుకుంది.

నాటకాన్ని గురించి పరిశీలించేప్పుడు నాటక సాహిత్య వికాసం గురించి సంగ్రహంగా పరిశీలించటం కన్పిస్తుంది. సామాన్య పాఠకుడి దగ్గర్నుంచి పరిశోధకుడి వరకు పనికివచ్చే సంస్కృత ఆంగ్ల అనువాద నాటకాలు, స్వతంత్ర రూపకాలు, ప్రహసనాలు, నాటికలు, ఆధునిక స్కిట్, నాట్యావధానం వంటి వాటిని గూర్చి సంగ్రహంగా వివరించటం పరిశోధకుని పరిశీలన పాటవాన్ని తెలియజేస్తుంది. నాటక రచయిత ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి జీవిత దర్శనంలో పుట్టుపూర్వోత్తరాలు,వైయక్తిక- సాహిత్య జీవనరేఖలు సంగ్రహంగా వివరించటం, ముఖాముఖివల్ల విషయ సేకరణ చేయటం పరిశోధకుడి అభిలాషను తెలియజేస్తుంది,

మునివాహనుడు ఆళ్వారుల భక్తి తత్త్వ నిరూపణకి ఆణిముత్యంలాగా తీర్చిదిద్దబడింది. ఇతివృత్తవైవిధ్యాన్ని వ్యక్తం చేస్తూ అఖిల మానవ సౌభ్రాతృత్వాన్ని సమాజోద్ధరణకు వినియోగించాలనే మానవతావాదంతో నాటక కథని తీర్చిదిద్దినట్లుగా విశ్లేషణలో కన్పిస్తుంది జాతి, వర్ణ, భాషాభేదాలకు మానవుడు అతీతంగా ఉండి లోక కల్యాణంకోసం పాటుపడాలనే తత్త్వాన్ని ప్రబోధిస్తూ తిరుప్పాణ్ ఆళ్వార్ వైష్ణవ భక్తి గుణ గానం చేసి తరించటం ఈ నాటకంలో అంతర్లీనంగా కన్పిస్తుంది. మతమౌఢ్య నిరసనం, హరిజనోద్ధరణం, మధుర గానం, వైష్ణవ భక్తి తత్త్వం మొదలైనవి ఆయా అంకాలలో ప్రాధాన్యం వహించటం, వాటి విశ్లేషణ, మానవతా వాదంతో సరిపోల్చటం కనిపిస్తుంది. సన్నివేశ కల్పనలో, పాత్ర చిత్రణలో, నాటక లక్షణ ప్రదర్శనలో సంప్రదాయ నాటక రీతులు, రచయిత తీర్చిదిద్దిన నాటక లక్షణాల సమన్వయాన్ని కొత్త కోణాల్లో పరిశోధకుడు విశ్లేషించటం మూడో అధ్యాయంలో ప్రదర్శితమవుతుంది, పూర్వ ఉత్తర రంగ విభజన కల్పనం మనో వైజ్ఞానిక విషయాల ప్రదర్శనం. నాటకం, ఆదర్శం, ప్రయోజనం, ఐక్యత్రయగుణ వైశిష్ట్యం, మోదాంత చారిత్రక, దృశ్యశ్రవ్యాత్మక నాటక లక్షణ భరితం కావటంతోపాటు, వర్గ పోరాట నాటక నిర్మాణంగా తీర్చిదిద్దటం విశ్లేషణలో కన్పిస్తుంది. వ్యావహారికానికి అతి చేరువగా ఉన్న గ్రాంథిక భాషా నిర్మాణం, ఛందస్సుతో ముత్యాలసరాల పాటల పోకడలు అనేక తీరుల్లో కనిపిస్తాయి.

"ఇది మానవు డేలిన భూమి
నరమానవు డంటిన భూమి" (మునివా॥ పుట 38) వంటి పాట రూపంలో సాహిత్యం కూర్చటం రచయిత ఆధునిక ఛందశ్శిల్ప వైచిత్రిని వ్యక్తం చేస్తుంది. ఛందోరీతుల్లో వైవిధ్యం, సంభాషణల్లో వచన కవిత్వం పోకడలు అడుగడుగునా కన్పిస్తాయి. నాటక కథా ప్రాధాన్యం రచయిత కథన శిల్పం, పరిశోధకుని విశ్లేషణాచాతుర్యం సంగ్రహంగా కన్పిస్తాయి.

'మునివాహనుడు' నాటకంలో మత దర్శనం వివిధ దశలు విశ్లేషణలో కన్పిస్తాయి. ఇందులో కనిపించే సామాజిక నేపథ్యం, భక్తి సంకీర్తన గానవైభవాల్ని వ్యక్తం చేస్తాయి. మత దురహంకారాన్ని విడనాడి 'మానవసేవే మాధవ సేవ' అనే సంస్కరణ భావాన్ని ప్రదర్శిస్తుంది. సన్నివేశ చాతుర్యం, రచనా రమ్యత్వం, పాత్రచిత్రణ శిల్పంలో అనేక రీతులుగా వ్యక్తం కావటం తిరుప్పాణ్ లోకసారంగముని, వేదవేద్యుడు, దేవదత్తుడు, శ్రీరంగనాథుడు, కావేరీనది వంటి వాటితో రసరమ్యంగా చిత్రీకరించటం కన్పిస్తుంది. ఇది ధర్మవీర ప్రధానంగా భక్తి శృంగారంతో అలరారే నాటకంగా అనేక కోణాల్లో కనిపిస్తుంది. లోక సారంగముని వాహనంగా కలవాడు తిరుప్పాణ్ ఆళ్వార్ ప్రధాన పాత్రగా ఈ నాటకం తీర్చిదిద్దబడింది. 'పాణ్' కులంలో జన్మించిన ఇతను హరిజనుడైనందున సంగీత వాద్య ప్రావీణ్యం అలవడటం, గాన మాధుర్యంతో మూర్తీభవించిన భక్తికి నిదర్శనంగా తిరుప్పాణ్ ఆదర్శవంతంగా కనిపిస్తాడు. సంప్రదాయ నిరసనకు తిరుప్పాణ్ ప్రతీకగా అనేక సందర్భాలలో దర్శనమిస్తాడు.

ఈ నాటక రచనలో రచయితకుండే ఆదర్శాలు; రచనారీతులు; సంప్రదాయ ప్రతిఘటన, హరిజనుల ఆలయ ప్రవేశం, సర్వమానవ సమానత్వం, ప్రపంచ శాంతి, సంప్రదాయ పాశ్చాత్య నాటక లక్షణ సమన్వయం; చారిత్రక నాటక రచనా పాటవం, అభ్యుదయ భావాల కూడలిగా చతుర్థాంక నిర్మాణం అనేక రీతులుగా కనిపిస్తుంది. రచయితలోని సంఘ సంస్కరణ భావం, ఆధునికత, అభ్యుదయం, స్త్రీపాత్ర ప్రమేయంలేని సరళ గ్రాంథిక దృశ్య శ్రవ్యాత్మక నాటక నిర్మాణదక్షత అనేక రీతులుగా ఈ నాటకంలో కన్పించటం అందరూ కొనియాడదగిందిగా ఉంది. ఈ నాటకంలోని ఇతివృత్తం, నాటక సన్నివేశ సంభాషణలు, గేయరచన, రస నిర్వహణం, అంక రంగ విభజన

వైవిధ్యం, మానవాభ్యుదయం, దళిత జనోద్ధరణం విశ్లేషణం నాటకంలోని వివిధ అంశాల్ని నూతన ధోరణుల్లో వ్యక్తం చేస్తుంది. ఈ పరిశోధనలో విశ్లేషణతో పాటు శిల్ప విశేషాల్ని, సామాజిక అంశాల్ని సమన్వయంతో వ్యక్తీకరించటం పరిశోధకుని అనుశీలన పాటవాన్ని వ్యక్తం చేస్తుంది.

ఈ లఘు సిద్ధాంత వ్యాసం సాహిత్య విద్యార్థులకు, పరిశోధకులకు వైష్ణవ భక్తితత్త్వ సాహిత్య విశేషాల్ని తెలుసుకోటానికి ఎంతో ఉపయోగకరమైందిగా ఉంది. మునివాహనుడు నాటకం మీద సర్వసమగ్రంగా పరిశోధన చేసిన శ్రీ డి. యస్. బషీర్‌గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

(సం)
డా॥ ఏ. వీరప్రసాదరావు

# ధన్యవాదాలు



ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు

శ్రీమతి కొలకలూరి భాగీరథి గారు

# ధన్యవాదాలు

నేను విద్యార్థిగా 1968 లో ప్రభుత్వ కళాశాల అనంతపురంలో చేరినప్పుడు ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు మాకు గురువుగారు. ఇదే వారితో నా తొలి పరిచయం.

గురువులు మిత్రులుగా మారితే ఎలాంటి సుపరిణామం కలుగుతుందో నా జీవితంలో మొదటిసారిగా నేను తెలుసుకొన్నాను.

ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు అప్పట్లో ఎన్. సి. సి. ఆఫీసర్‌గా ఉన్నారు. వారి దగ్గర నేను అండర్ ఆఫీసర్‌గా ఉండి వారికి ఇంకా దగ్గరై వారి సొంత సోదరుని స్థానం పొందాను.

ఒక మహోన్నతమైన వ్యక్తికి శిష్యునిగా పరిచయమై, మిత్రునిగా, సోదరునిగా విశిష్ట స్థానం పొందటం నా పూర్వజన్మ సుకృతం. భూత, వర్తమాన, భవిష్యత్ కాలాల్లో విద్యార్థి లోకంలో ఏ విద్యార్థికి దక్కని ఇంతటి స్థానం, గురువుగా మిత్రునిగా సోదరునిగా నాకు దక్కటం నా అదృష్టం. వీరు రచించిన సుప్రసిద్ధ 'మునివాహనుడు' నాటకాన్ని ముందుగా పరిశోధించిన నేను భాగ్యవంతుణ్ణి.

ఇంతటి మహోన్నతమైన స్థానాన్ని నాకు కలుగజేసిన మా గురువులు ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారికి, శ్రీమతి కొలకలూరి భాగీరథిగారికి నా ధన్యవాదాలు.

—డి. యస్. బషీర్

ఆచార్య కొలకలూరి ఇనాక్
ఆంధ్రాచార్యులు, బాషాధ్యక్షులు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

అనంతపురం
18-6-1995

# అభినందనం

ఇది పరిచయం కాదు, ముందుమాట కాదు, అంకితామోదం కాదు, అభి నందనం.

మునివాహనుడు నేను వ్రాసిన నాటకం. దానిమీద పరిశోధనమీ గ్రంథం.

నా నాటకం మీద ఈ పరిశీలనం చేయటం విశేషం. అదీ విశ్వవిద్యా లయం స్థాయిలో జరగటం మరీ విశేషం.

శ్రీ వేంకటేశ్వర, నాగార్జున, ఆంధ్ర, తెలుగు విశ్వవిద్యాలయాలలో నా నాటక, కథానిక, నవలా ప్రక్రియలమీద ప్రత్యేకంగా పరిశోధనలు చేయటం, పిహెచ్‌డి, ఎం.ఫిల్. డిగ్రీలు పొందటం సువిశేషం.

అయితే నేనున్న మా విశ్వవిద్యాలయంలో మా శాఖలో పరిశోధన జర గటం మరీ సువిశేషం.

ఈ కృషి, పర్యవేక్షణ నిర్వహించిన డా॥ ఏ. వీరప్రసాదరావు మా పూర్వ విద్యార్థి, మా సహోద్యోగి. పరిశోధన చేసిన శ్రీ డి. యస్. బషీర్ మా విద్యార్థి, కర్నూలు ఉస్మానియా కళాశాల తెలుగుశాఖ అధ్యక్షుడు.

పర్యవేక్షక పరిశోధకులు నాకు చిరకాలంగా మిత్రులు. మిత్రకార్యమైన ఈ సత్కార్యం సత్కారంగా మరీ మరీ సువిశేషం.

నాది నందితాంతరంగం. ఈ పరిశోధనం వీళ్ళిద్దరి ఆనందితాంతః కరణం. వాళ్ళ మనశ్శ్మమాసమాశ్వాసానికిది అభినందనం.

ఈ పరిశోధన గ్రంథంలోని ప్రముఖాంశాలు నాకు ఆనంద సంపాదకాలు కావటంవల్ల అమూల్యంగా, ఆత్మీయంగా, ఆమోదయోగ్యంగా ఉన్నాయి.

ఈ పరిశోధన గ్రంథంలో స్థూలంగా తెలిపిన తెలుగు నాటక పరిణామం
టగా ఉంది. నా జీవిత పరిచయంలో సాధ్యమయినంత సమాచారం
చటం ఉంది. నాటక లక్షణాల దృష్టితో మునివాహనుడు పరిశీలించటం
తీమండితంగా ఉంది. మత పాత్ర రస దృష్టితో చేసిన కృషి చక్కని
ణంగా ఉంది. రచయితగా నా స్థానం అంచనా వేయటానికి చేసిన మంచి
త్నం ఉంది.

పరిశోధకుడు నాటకలక్ష్య లక్షణ సమన్వయంగా చేసిన కృషి విశిష్టంగా
రస చర్చలో అద్భుత చాకచక్యం ప్రదర్శించాడు. నాటక మతనేపథ్యం
గా వివరించాడు. నాటక స్వభావం, తత్త్వం స్పష్టంగా ప్రతిపాదించాడు.

పరిశోధకుడు నాతో చాలాసార్లు చాలా విషయాలు ముఖాముఖిగా
చాడు. ముద్రిత ప్రతి అందించటం కంటే ముందు ఏ దశలోనూ దీన్ని
అవకాశం, ఇబ్బంది నాకు పరిశోధక, పర్యవేక్షకులు కలిగించలేదు.

ఈ పరిశోధనం దళిత సాహిత్య సమ్యగవగాహనకు ప్రస్థాన పథంలో
తమవుతూ ఉంది.

మంచి పరిశోధనం చేసి, యం.ఫిల్. పట్టం పొంది గ్రంథ రూపంలో
స్తున్న శ్రీ డి. యస్. బషీర్‌ను సతీసమేతుడనై, హృదయపూర్వకంగా
ందిస్తున్నాను.

ఇలాగే శ్రీ డి.యస్. బషీర్ పిహెచ్.డి. కూడా చేయాలని, ఇంతకంటే
త ఉత్సాహంతో డా॥ ఏ. వీరప్రసాదరావు పర్యవేక్షణ చేయాలని గురు
ను ఆశీర్వదిస్తున్నాను.

ఇంత చక్కని పరిశోధనం చేసిన మిత్రులిద్దరికిదే అభినందనం.

(సం.)
కొలకలూరి ఇనాక్

# కృతజ్ఞతలు

'మునివాహనుడు - ఒక పరిశీలన' అంశంపై ఎమ్. ఫిల్., చేయటానికి నాకు అనుమతి నిచ్చిన శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి,

అనుమతి పొందటంలో ఎదురైన పరిపాలనా సంబంధమైన ఇబ్బందుల్ని చాకచాక్యంగా నివారించటంలో కృషి చేసిన శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు, అప్పట్లో ప్రిన్స్‌పాల్‌గా ఉన్న ఆచార్య ఎమ్. డి. భాషా మోహిద్దీన్, జంతుశాస్త్ర విభాగం గారికి,

నా ఎమ్. ఫిల్., పరిశోధనకు పర్యవేక్షకులుగా అంగీకరించి పర్యవేక్షణకు సంబంధించిన ప్రతి విషయంలోనూ పసుగూ, విరామం లేకుండా అన్ని విధాల నాకు సహాయ సహకారాలందించిన గురువులు డా॥ ఏ. వీరప్రసాదరావుగారికి,

పార్ట్‌టైం ఎమ్. ఫిల్., చేయటానికి ప్రోత్సహించి, నన్ను ఉత్తేజపరచిన మా ఉస్మానియా కళాశాల, కర్నూలు యాజమాన్యానికి, ప్రత్యేకించి కళాశాల నిర్వాహకులు, యాజమాన్య సభ్యులు శ్రీ ఎమ్. అజ్మతుల్లాఖాన్ గారికి,

అనంతపురంలో నా ఎమ్ ఫిల్., పరిశోధన నిర్విఘ్నంగా సాగటానికి సహాయపడిన నా సోదరులు శ్రీ డి. యస్. ఫక్రోద్దీన్, శ్రీ డి. యస్. హైదర్ వలి, నా చెల్లి శ్రీమతి ఏ. షాజహాన్ బేగం గారలకు,

ఈ లఘు సిద్ధాంత వ్యాసాన్ని పుస్తక రూపంలో తేవటానికి ఆర్థిక సహాయాన్ని అందించిన - తిరుమల తిరుపతి దేవస్థానం వారికి,

ఇంకా నా పరిశోధన విషయంలో కాని, ప్రచురణ విషయంలో కాని ఎన్నో విధాల సహకరించిన అందరికీ నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

—డి. యస్. బషీర్

# విషయసూచిక

# 1. ఉపోద్ఘాతం

ఆధునిక కాలంలో, తెలుగు సాహిత్యంలో నాటక ప్రక్రియ అభివృద్ధిని ప్రచార ప్రాచుర్యాల్ని పొందింది. సమాజంలోని స్థితిగతులు వస్తుగతంగా నాటకాల్లో స్థానం సంపాదించుకొన్నాయి. దళిత జనోద్ధరణం, భక్తి పారవశ్యం, సమతాభావం, మానవత్వం అనే అంశాలమీద ఎన్నో నాటకాలు వెలువడ్డాయి. నాటక పరిణామంలో వస్తుగతంగా సంస్కరణం స్థానాన్ని ఆపాదించుకొన్న సాంప్రదాయక చారిత్రక నాటకం "మునివాహనుడు."

ఈ నాటక పరిశీలనం అయిదు అధ్యాయాలుగా విభజించడం జరిగింది. మొదటి అధ్యాయంలో తెలుగు నాటక వికాసం, వైవిధ్యం వివరించటం ఉంది.

రెండో అధ్యాయంలో నాటక రచయిత ఆచార్య కొలకలూరి ఇనాక్ వైయక్తిక, సాహిత్య, జీవిత దర్శనం సంగ్రహ వివరణం ఉంది.

మూడో అధ్యాయంలో 'మునివాహనుడు' నాటకంలోని సాంప్రదాయక పాశ్చాత్య నాటక లక్షణాల సమన్వయంలోపాటు ఇతివృత్తం విశదీకరించే కృషి ఉంది.

నాలుగో అధ్యాయంలో మత ప్రస్థానం, పాత్ర చిత్రణం, రసశిల్పం వివరించటం జరిగింది.

అయిదో అధ్యాయంలో నాటక రచయిత దృక్పథం, ప్రయోజనం, పరిశోధనాంశాల క్రోడీకరణంగా ఉపసంహారం ఉంది.

# 2. తెలుగు నాటక వికాసం

పదకొండో శతాబ్దిలో ఆరంభమైన తెలుగు సాహిత్యం మూడు పూవులు ఆరు కాయలుగా క్రమపరిణామం చెంది నేటి స్థితికి చేరుకోవడం సాహితీ పిపాసులకు తెలిసిన విషయమే. అయితే, సాహిత్య ప్రక్రియలలో మిక్కిలి శ్రేష్ఠమైందిగా పేర్కొబడుతున్న నాటక ప్రక్రియ తెలుగులో మొదట ఆవిర్భవించలేదు. పందొమ్మిదో శతాబ్దం చివరిభాగంలో మాత్రమే నాటక ప్రక్రియ సృష్టిపొందింది. సంస్కృతం, ఆంగ్లరూపకాల ఆంధ్రీకరణం, అనుకరణల కారణంగా తెలుగు నాటకం అనేది ఆధునిక కాలంలో స్థిరమై నిలబడింది.[1]

ఇంతకుముందు కాలంలో ఇది ప్రదర్శన రూపాలైన తోలుబొమ్మలాట, భామాకలాపం, కూచిపూడి నృత్యం, భాగవతమేళ నాటకం, యక్షగానం మొదలైన రీతులలో వికసించింది.[2] దీనికి వస్తువు, పాత్రలు, సన్నివేశం, రంగ విభజనం, దీపకాంతులు తోడై, కొన్ని అపురూప రూపకాలు రూపొందాయి.

మొదట్లో ఇవి సంగీత నృత్య ప్రధానాలుగా ఉండేవి. క్రమంగా సంస్కృత, ఆంగ్లనాటక లక్షణాల్ని జీర్ణించుకొని, విశిష్ట లక్షణాలతో తెలుగు రూపకాలుగా వెలువడ్డాయి. క్రీ. శ. 1880 లో ఇది ప్రారంభమై, దాదాపు క్రీ.శ. 1920 వరకు అనేక మార్గాలలో కొనసాగి, నూత్న కాంతులతో వికసించింది. 1870 లో ప్రప్రథమంగా అభిజ్ఞాన శాకుంతలాన్ని ఎమ్. శేషాచార్యులు అనువదించారని తెలియవచ్చినా, అది లభ్యం కాకపోవడంవల్ల కొక్కొండ వెంకటరత్నం పంతులు 'నరకాసుర విజయవ్యాయోగం' మొదటి అనువాదం అనవలసి ఉంది. వీరు వీరగ్రాంథిక వాదులు. వీరి అనువాదం సంస్కృత మూలానుసరణంగా ఉంది.

1874 లో 'జూలియస్ సీజర్' నాటకాన్ని ఆంగ్లం నుంచి తెలుగులోనికి అనువదించి, 1876 లో ప్రకటించి, ఘనత వహించిన నాటకకర్త వావిలాల

వాసుదేవశాస్త్రి. ఇది ఆంగ్ల నాటకానువాదాల్లో మొదటిది. వీరు 1880 లో 'నందకరాజ్యం' అనే స్వతంత్ర సాంఘిక నాటకం రచించారు.[3]

1880 లో కందుకూరి వీరేశలింగం పంతులు షేక్స్పియర్ 'కామిడీ ఆఫ్ ఎర్రర్స్'ను 'చమత్కార రత్నావళి'గా, శ్రీహర్షుని రత్నావళినీ అనువదించి ప్రదర్శింపజేశారు.[4] ఈ రీతిగా తెలుగులో నాటక రచన క్రీ.శ. 1880 నుండి ఒక క్రమమైన రీతిలో కొనసాగినట్లు చెప్పవచ్చు.[5]

## సంస్కృతానువాద నాటకం :

ప్రాచీనాంధ్ర కవులు సంస్కృత నాటకాల్ని ఆంధ్రీకరించినా, అవి కావ్యాలుగా, ప్రబంధాలుగా అవతరించాయి. పిల్లలమర్రి పినవీరభద్ర కవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటకాన్ని శృంగార శాకుంతల ప్రబంధంగా ఆంధ్రీకరించారు. మంచన రాజశేఖర కవి సంస్కృతంలో రచించిన కర్పూరమంజరీ నాటకాన్ని కేయూర బాహుచరిత్ర మనే ప్రబంధంగా తెనిగించారు. ఆధునిక కాలంలో కోరాడ రామచంద్ర శాస్త్రి కాలంలోనే తెలుగులో సంస్కృత రూపకానువాద ఘట్టం ప్రారంభమైంది. దీని తరువాత కొక్కొండ వెంకటరత్నం పంతులు, కందుకూరి, వావిలాల, వడ్డాది మొదలైనవారు ప్రసిద్ధి పొందిన సంస్కృత నాటకాల్ని తెలుగులో అనువాదం చేశారు. శ్రీపాద కామేశ్వరరావు మొదలైనవారు ఈ పద్ధతిని మొదట అనుసరించారు. జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి నూర్జహాన్, షాజహాన్ అనువాదాలు ప్రసిద్ధాలు.

## ఆంగ్ల రూపకానువాదం :

పందొమ్మిదో శతాబ్దం ఉత్తర భాగంలో తెలుగులో ఆంధ్రులు నాటకాలు రచింపబూనుకొన్నారు. అలాంటి తెలుగు నాటక రచనా వికాసాలు ఆంగ్ల భాషా ప్రభావంతోనే కలిగినవనడంలో సందేహం లేదు. వాఙ్మయాంతర సంపర్కం వల్ల ఒక వాఙ్మయంలో పరిణామం కలుగడం సహజం. ప్రపంచమంతటా వ్యాపించి ప్రఖ్యాతి పొందిన ఆంగ్లభాష భారతదేశంలో కూడ రాజభాష కావడం వల్ల, తదభ్యాసం సర్వజనులకు ఆవశ్యకమైంది. తత్సంపర్కం వల్ల ఆంగ్ల వాఙ్మయంలోని రసవన్నాటకా లనేకం ప్రదర్శన మూలకంగా వ్యాప్తి చెందడం వల్ల మనవారుకూడ తెలుగులో నాటకాలు రచింప నారంభించారు.[6]

"These dark days for Dramas continued upto the middle of the Nineteenth Century....When English Education spread itself through the length and breadth of India and the English Knowing pub'ic saw the marvellous effects produced by the English stage and its wonderful senic performances, the Indians opened their eyes and commenced to enquire what their ancient dramas were like...."[7]

ప్రసిద్ధి పొందిన ఆంగ్ల రూపకాలు తెలుగులో అనువాదం చేయబడ్డాయి. ఇంగ్లీషు నాటకం అనువదింపబడేటప్పుడు అనుసరణం ప్రధానంగా పాటింప బడింది. షేక్స్పియర్ నాటకాలే మొట్టమొదట తెలుగులో అనువదింపబడ్డాయి. ఈ విధానం కందుకూరి వీరేశలింగం పంతులతో ప్రారంభమైంది. ఇటీవలి కాలంలో కూడ ఇలాంటి రచనల్ని చేస్తున్నారు. రష్యన్ నాటక సాహిత్యం నుంచి చెకోవ్, గోర్కీ మొదలైనవారి రచనలు అనువదింపబడుతున్నాయి.

ఇక తెలుగు నాటకాలపై ఇంగ్లీషు నాటకాల ప్రభావం గురించి ఆలోచించి నట్లయితే వీటి ప్రభావంతో తెలుగులో విషాదాంత నాటకాలు, ఏకాంకికలు అనేవి నూతన ప్రక్రియలుగా బయలుదేరాయి. నాటక రచన, నిర్మాణ శిల్పం, అంకాన్ని రంగాలుగా విభజించడం, స్వగతం, పాత్రోచిత భాష, భావ సంఘర్షణం, కోరస్ మొదలైన లక్షణాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఆంధ్ర నాటక పితామహుడు ధర్మ వరం రామకృష్ణమాచార్యులు ఇలాంటి లక్షణాలు కలిగిన తెలుగు నాటకాలు ప్రప్రథమంగా రచించి ప్రదర్శించారు.

విశ్వనాథ, దువ్వూరి, రాజమన్నార్, ఆచార్య ఆత్రేయ, భమిడిపాటి మొదలైనవారి నాటకాలలో కూడ ఇంగ్లీషు నాటక ప్రభావం అడుగడుగునా కని పిస్తుంది. ఇంగ్లీషు నాటకం మూలంగానే విషాద రూపకాలు, గేయ రూపకాలు, పద్య రూపకాలు, ఏకాంకికలు, శ్రవ్య నాటకాలు మొదలైనవి క్రొత్త ప్రక్రియ లుగా తెలుగునాటకసాహిత్యంలో వెలిశాయి.

## స్వతంత్ర రూపకాలు :

తెలుగులో అనేకమైన స్వతంత్ర రూపకాలు వచ్చాయి. వీనిలో పౌరాణిక నాటకాలు మొదట్లో రచింపబడ్డాయి. మంజరీ మధుకరీయము, ప్రహ్లాద, సత్య హరిశ్చంద్ర, చిత్రనళీయము, కీచకవధ, పాండవోద్యోగ విజయము మొదలయినవి పేర్కొనదగిన పౌరాణిక నాటకాలు. సాంఘిక నాటకాలలో ఇతివృత్తం కల్పితంగా ఉంటుంది. వావిలాల వారి "నందకరాజ్యం" 1880 లో వచ్చిన మొదటి తెలుగు సాంఘిక నాటకంగా పేర్కొబడింది. వల్లూరి 'సాగరిక', గురజాడ 'కన్యాశుల్కం', పానుగంటి 'కంఠాభరణం', ఆత్రేయ 'ఎన్. జి. వో', కొడాలి 'దొంగవీరడు' మొదలైనవి పేర్కోదగిన సాంఘిక నాటకాలు.

## చారిత్రక నాటకాలు :

తెలుగులో కొన్ని స్వతంత్రమైన చారిత్రక నాటకాలు అవతరించాయి. వాటిలో వేదం ప్రతాపరుద్రీయం, శివాజీ పేర్కోదగినవి. కోలాచలంవారి 'రామరాజ చరిత్రము' చారిత్రకరూపకం. తెలుగులో వచ్చిన స్వతంత్ర చారిత్రక నాటకాలలో ఇతివృత్తం చాలా భాగం ఆంధ్ర దేశానికి చెందివుంది. ఇది ఆంధ్రదేశ చారిత్రక విశేషాల్ని సామాజికులకు అందజేస్తుంది. అయితే, చారిత్రక నాటకాల్ని రచించడంలో రచయిత తన ప్రజ్ఞాపాటవాల్ని ప్రదర్శించవలసి ఉంటుంది.

## ప్రచార రూపకం :

ఇది ఎక్కువగా సందేశాత్మకమైనది. దీంట్లో ఆ కాలంనాటి సమస్యలకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. నాటక రచయిత ఆ సమస్యలకు సార్వకాలిక, సార్వజనీన అంశాల్ని ఆపాదించి, దానికి విలువలను పెంచుతాడు. దేశభక్తి, రాజకీయ, మత సిద్ధాంత నాటకాలు ఈ కోవకు చెందుతాయి. ఉండవల్లి కోటయ్య 'క్రామేడ్ వెంకమ్మ' సుప్రసిద్ధ తెలుగు ప్రచారరూపకం. ఇలాంటివి ప్రజలకు ఆకాలం నాటి సమస్యల్ని అనేక కోణాలలో పరిశీలించి చూపించి విషయాల్ని తెలియజేస్తుంటాయి. ఎన్నికల సందర్భంగా. రాజకీయ పరిపాలనలో మార్పు సందర్భంగా ఇలాంటి రూపకాలు నిర్మాణమౌతుంటాయి.

## మనస్తత్వ నిరూపక నాటకం :

ఇలాంటి నాటకాలలో కొన్ని కథాప్రధానాలుగా, కొన్ని సాహిత్యప్రధానాలుగా, ఇంకొన్ని సమస్యాప్రధానాలుగా కనిపిస్తాయి. కొన్నింటిలో పాత్ర ప్రాధాన్యం, కొన్ని నాటకాలలో మనస్తత్వ ప్రాధాన్యం వివిధ రీతులలో గోచరిస్తూ ఉంటుంది. ఈ లక్షణాన్నిబట్టి ఆ నాటకంలో ఉండే పైవిభాగం తెలుస్తుంది. మనస్తత్వం నిరూపణం గల నాటకాలు తెలుగులో అంతగా రాలేదు. ఉన్నవాటిలో స్త్రీ మనస్తత్వాన్ని నిరూపించే నాటకాలు కొన్ని ఉన్నాయి. పానుగంటివారి 'రాధాకృష్ణ', కాళ్ళకూరివారి 'వాల్మీకి', చలం గారి 'భానుమతి' మొదలైనవి పేర్కొదగినవి. ఇవి ఆనాటి సంఘంలోని పాత్రల మనస్తత్వాల్ని కళ్ళకు కట్టినట్లుగా చూపిస్తుంటాయి.

## విషాద రూపకాలు :

ధర్మవరం వారి 'విషాద సారంగధర' నాటకంతో తెలుగులో విషాదాంత నాటక రచన ఆరంభమైంది. ఇది ఇంగ్లీషులో ఉండే విషాదాంత రూపకాల లక్షణాలతో రచింపబడినట్లుగా కనిపిస్తుంది. సంస్కృత భాషలో విషాదాంత నాటకాలు కొన్ని రచింపబడ్డాయి. కాని, గ్రీకుల విషాదాంత నాటక నిర్మాణం, ఇంగ్లీషు విషాదాంత నాటక నిర్మాణాలలో ఉత్తములైనవారే నాయకులుగా ఉండాలి అన్న నియమం సడలిపోయింది. ఇలాంటి నాటకాలలో నాయికానాయకులు సామాన్యులుగా, సన్నివేశాలు సాధారణంగా ఉంటాయి.

నాటక నిర్మాణ శిల్పబలంతో, పాత్రల తరతమ భేదాలతో, భావక్షాళన కూడ సాధింపబడుతుంది. 'అజామీళ' నాటకంలో నాయకుడు రాజు కాడు. పానుగంటివారి 'రాతిస్తంభము'లో నాయకుడు సామాన్యుడు. చారిత్రక ఇతివృత్తంగల విషాద రూపకాల్ని కొందరు రచించారు. ఇలాంటివాటిలో దువ్వూరి 'కుంభరాణా', విశ్వనాథవారి 'అనార్కలీ' మొదలైనవి పేర్కొదగినవి. ఈ విషాదాంత నాటకాలు దేశ, కాల, స్థల ఐక్యాన్ని సూచిస్తూ; పాత్రల, సన్నివేశాల ఔన్నత్యాన్ని ఇనుమడింపజేస్తుంటాయి. ఇవి ప్రేక్షకులలో చెరగని ముద్రని వేస్తుంటాయి. ప్రేక్షకులలో ఆలోచనల్ని విజ్ఞానాన్నికూడ కొన్ని సందర్భాలలో ప్రదీప్తం చేస్తుంటాయి.

## ప్రహసనాలు :

ప్రహసనం అంటే కవి కల్పితమైన అనుదాత్త చరిత్రమని, ఒకటి లేక రెండు అంకాలు ఉండవచ్చునని, హాస్యం ప్రధాన రసం అని అలంకారికుల నిర్వచనం. పాశ్చాత్యుల 'ఫార్సు' నాటక లక్షణాలు ప్రహసన లక్షణాలతో సరి పోతున్నాయి. అది వినోద ప్రధానమై రూపొందింది. ప్రహసనాలలో విరుద్ధ భావాలు, విరుద్ధ సన్నివేశాలు మొదలైనవాటిమూలంగా హాస్యం ఏర్పడు తుంది. ప్రహసనం అనేది జన జీవనానికి అత్యంత సన్నిహితమైంది. ఈ విషయం వివరిస్తూ తెలుగులో ముట్నూరి సంగమేశం రచన 'తెనుగు హాస్యం' వంటి గ్రంథాలు వెలువడ్డాయి. మునిమాణిక్యం నరసింహారావు హాస్యాన్ని గురించి అనేక వ్యాసాలు రచించారు.

ప్రహసనంలో హాస్యం 1. పాత్రగతం 2. వాక్యగతం 3. సన్నివేశగతం అని పేర్కొబడింది. తెలుగులో ప్రహసనం రచన కందుకూరివారితో ఆరంభం అయింది. వీరి ప్రహసనాలలో వ్యంగ్యం అధికంగా ఉంటుంది. చిలకమర్తి, పానుగంటి మొదలైనవారి ప్రహసనాలు తెలుగులో ప్రసిద్ధి పొందాయి. ఇలాంటి ప్రహసనాలు వ్యంగ్యాన్ని, హాస్యాన్ని వెల్లడి చేస్తుంటాయి. ఇవి పాఠకులకు, ప్రేక్షకులకు నిండైన నవ్వుని పుట్టిస్తుంటాయి. చమత్కారం సూటిగానూ, సూచకంగానూ ఉంటుంది. అందులోనే హాస్యం, ఆనందం కలుగుతాయి.

## నాటికలు :

సంస్కృతంలో నాటిక చతురాంక పరిమితం. నేటి తెలుగు నాటిక ఈ లక్షణాలు కలిగిందికాదు. ఏకనాయక ప్రధానం; ఏకవస్తు, ఏకరంగం; స్థల, కాల, దేశైక్యాలు ఇత్యాదులు పాటింపబడటం; ప్రదర్శనం 30 నుండి 45 నిమి షాల వ్యవధిలో ముగిసిపోయే లక్షణం కలిగినట్లుగా ఈనాడు మనం చూస్తున్న నాటిక గోచరిస్తుంది. ఇలాంటి లక్షణాలు కలిగి కొన్ని సందర్భాలలో సన్ని వేశాలను మార్చుకోవడం వల్ల, రంగస్థలంలో చిన్న మార్పులు చేయడంవల్ల ప్రదర్శనా లక్షణం కలిగి, తెలుగు నాటిక దర్శింపబడుతూ ఉంటుంది. తెలుగులో వచ్చిన ప్రసిద్ధ నాటికా సంపుటాలు, అందులోని నాటికలు వీటికి ఉదాహర ణలుగా పేర్కొవచ్చు.

ఈనాడు ఆంధ్రదేశంలో నాటికల్ని, ఏకాంకికల్ని విశేషంగా రచిస్తున్నారు, ప్రదర్శిస్తున్నారు. ఇతివృత్తం కారణంగా ఈ నాటికలు పౌరాణికాలు, చారిత్రకాలు, సాంఘికాలు మొదలైన భేదాలు కలిగి ఉంటాయి. భానుమతి, ప్రారబ్ధం, అల్లీ ముతా, మధురప్రియ, అపవాదు, భిక్షాపాత్ర మొదలైనవి ప్రసిద్ధ నాటికలు.

## ఏకాంకిక :

ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఏకాంకిక అనేది కూడ 30 నుండి 45 నిమిషాల ప్రదర్శన పరిమితి కలిగి, ఏక నాయకమై, ఏక దివస ప్రయోగార్థమై ఉంటుంది. పాత్రల సంఖ్య పరిమితంగా ఉంటుంది. ఇది ఏకరంగంగానే ఉండాలి. ఏకాంకిక అనేది బహుళ ప్రయోజనాన్ని, ప్రాచుర్యాన్ని పొందింది. ఇలాంటివాటిలో ఏమి మగవాళ్ళు, నిష్ఫలం, శర్మిష్ఠ మొదలైనవి పేర్కొదగినవి.

## పద్యనాటికలు :

ప్రాచీనకాలంలో వెలసిన పద్యనాటిక గద్యకావ్యం లాగ పద్యగద్య సమ్మిశ్రితమై ఉంది. చంపూకావ్య రీతిలో కొన్ని పద్యనాటికలు వెలిశాయి. గ్రీకుల విషాద రూపకం లక్షణం కలిగినవి పద్యరూపంలోనే ఉన్నాయి. సంస్కృత రూపకానువాదాలు, ఆంగ్ల రూపకానువాదాలు రూపొందాయి. వీటిలో క్రొత్త విధానాన్ని ప్రవేశపెట్టిన వావిలాలవారు సీజరు చరిత్ర' మనే పద్యనాటికను అనువదించారు. తరువాత 'నందక రాజ్యం' అనేది కేవలం పద్యాలలోనే రచింపబడింది. ఆంధ్ర నాటక పితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులు తెలుగు నాటక రంగంలో పద్యాలు పాడుకొనే పద్ధతిని ప్రవేశపెట్టి, తెలుగు నాటక రంగంలో సంగీతపరంగా మార్పు రావడానికి దోహదం చేశారు. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' అనేది ప్రసిద్ధమైన పద్య నాటకం.

## గేయ రూపకాలు :

తెలుగు నాటకాలలో పాటలను కూర్చటం ధర్మవరం వారితో ప్రారంభమైంది. శివశంకరశాస్త్రిగారితో తెలుగులో సంపూర్ణ గేయరూపక రచనం ఆరంభ

మైంది. 'చండీదాసు', 'ప్రతిభ' మొదలైనవి పేర్కొనదగిన గేయ రూపకాలు. విశ్వేశ్వరరావుగారి 'బిల్హణీయం,' రావి నారాయణరెడ్డిగారి 'వెన్నెలవాడ,' దేవులపల్లి 'ఊర్వశి', 'శర్మిష్ఠ', 'ధనుర్దాసు' మొదలైనవి సుప్రసిద్ధ గేయ నాటికలు. ఇవి ఎక్కువగా రంగస్థలంపైగాక ఆకాశవాణిలో ప్రసారమౌతుండేవి.

## శ్రవ్య రూపకాలు - రేడియో నాటికాలు :

ప్రదర్శనానికి అనుకూలం కాని నాటకాలు శ్రవ్య రూపకాలు అని పేర్కొంటున్నారు. దీంట్లో నిర్మాణశిల్పం అనేది ఒక విచిత్ర సాహిత్య ప్రక్రియగా ఉంటుంది. రంగస్థల ప్రదర్శనంలాగా రేడియోలో ప్రసారం చేయబడే శ్రవ్య రూపక ప్రయోగాలలోనూ ఒక్కొక్క భూమికకు ఒక్కొక్క పాత్ర ఉంటుంది. కాని,నటులకు,ప్రేక్షకులకు దీంట్లో ప్రత్యక్షసంబంధం ఉండదు. కేవలం శ్రోతలుగానే ఉంటారు. వాచికాభినయాన్నిబట్టి ఆ రూపకంలోని రచనా శిల్పం, తదితర విశేషాల్ని శ్రోతలు గుర్తిస్తారు. రేడియోలో ప్రసారం చేయబడిన తొలి తెలుగు రూపకం ముద్దుకృష్ణగారి 'అనార్కలీ.' దీంట్లో దేవులపల్లి పాటలు జోడింపబడ్డాయి. శ్రవ్య రూపకాలు క్రొత్త ప్రయోగాలు. ఇందుకు ఉదాహరణంగా కుటుంబరావుగారి 'భార్యా రూపవతీ,' 'కొరకరానికొయ్య' మొదలైనవి పేర్కోవచ్చు.

## బాల నాటికలు :

ఇవి బాలల వినోదం కోసం పెద్దవారు వ్రాసి, ప్రదర్శించే నాటికలు; కేవలం బాలలే నటించి ప్రదర్శించడానికి తగిన నాటకాలుగా రెండు విధాలుగా కనబడుతున్నాయి. బాలల నాటికల్ని వ్రాసి ప్రదర్శింపజేసినవారిలో కరుణశ్రీ, న్యాపతి రాఘవరావు, నార్ల చిరంజీవి మొదలైనవారిని పేర్కోవచ్చును. కరుణశ్రీ 'కరుణామయి', 'రాముని బుద్ధిమంతనం,' మొదలైనవి ప్రసిద్ధాలు. ఇలాంటి బాలల నాటికలలో 'ఇంటిముందు' 'నువ్వా - నేనా' అనేవి బహుళ ప్రచారాన్ని పొందాయి.

## ఇతర ప్రక్రియలు :

ఆధునిక కాలంలో రేడియోలో 'స్కిట్' అనే నాటక సాహిత్య ప్రక్రియని తెలుగులో 'వాక్చిత్రం' అని అంటున్నారు. ఇంగ్లీషులోని 'మోనో లాగ్' అనేదికూడ ఈ లక్షణం కలిగిందే. ఇందులో ఒకేవ్యక్తి వివిధాలైన స్వీయ మనోభావాల్ని లేదా ఇతరుల మనోభావాల్ని కాకుస్వరంతో వ్యక్తం చేయడం కనిపిస్తుంది. ఆచార్య చంద్రశేఖరంగారు, రమణారెడ్డి మొదలైనవారు ఇలాంటి స్కిట్లను నిర్వహించడంలో సుప్రసిద్ధులు.

ధారా రామనాథశాస్త్రి 'నాట్యావధానం,' 'నేత్రావధానం' అనే క్రొత్త ప్రక్రియల్ని రూపొందించారు. ఈవిధంగానే స్కిట్లతో పాటు స్వల్పకాల వ్యవధిలో ప్రదర్శించడానికి వీలైన నృత్యాభినయం, ధ్వన్యనుకరణం మొదలగు నవికూడ ప్రదర్శింపబడుతున్నాయి.

చారిత్రక, పౌరాణిక, సాంఘిక జీవనగాథలతో సంఘటనలతో తెలుగు నాటకాలు, నాటికలు మొదలైనవి రూపొందింపబడ్డాయి. ఇవి సామాజికులపై విశేషమైన ప్రభావాన్ని చూపి ధర్మం, నీతిని బోధిస్తున్నాయి. జీవితంలో ఎత్తు పల్లాల్ని, తద్వారా సక్రమ మార్గాల్ని సూచిస్తున్నాయి.

నేడు ఆకాశవాణి, దూరదర్శన్, చలనచిత్ర రంగాలలోకూడ ఈ రూప కాలు అనేకం ప్రదర్శింపబడి, ప్రేక్షకుల్ని విజ్ఞులుగా, ఆలోచనాపరులుగా మారుస్తూ, ఆనందాన్ని కలుగజేస్తున్నాయి. ఈ విధంగా తెలుగు నాటకంలో వివిధ ప్రక్రియలు, అనేక దశలలో పరిణామం చెంది, నేడు మనం చూస్తున్న సమగ్రమైన తెలుగు నాటకం అవతరించడానికి కారణభూతమయ్యాయి. ఇవి దేశీయ, విదేశీయ ప్రజానీకానికి చైతన్యాన్ని, దీప్తిని కల్గిస్తున్నాయి.

## నాటక సాహిత్య వైవిధ్యం

ఏ సాహిత్యంలోనైనాసరే - ఇతర ప్రక్రియలకన్నా శ్రేష్ఠమైంది నాటక ప్రక్రియ. లలిత కళలైన చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, నాట్యం, కవిత్వం సమ్మేళనమే నాటకం. అందరిచేత ఆమోదింపబడి తన ప్రత్యేకతను నిలబెట్టు

కొన్న ప్రక్రియ నాటకం. సంస్కృతంలో 'కావ్యేషు నాటకం రమ్యమ్' అన్న ఆర్యోక్తి ఉంది. అంటే - కావ్యాలలో నాటకం ఒకటనీ, అందులో అది రమ్యతర మైందని దీనికర్థం. నాటకం రంగస్థలంపై ఆయా పాత్రలద్వారా దర్శ నీయమై, శ్రవణీయమై, ఆనందదాయకమై, అందరి సంతృప్తికి మూలమైంది. ఇంతేకాదు - 'నాటకాంతం హి సాహిత్యమ్' అని పెద్దలంటారు.

దేశీయ, విదేశీయ రూపకాలలో ఇతివృత్తం ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటుంది. సంస్కృతంలో ఇతివృత్తం నాట్య శరీరమని భరత మహర్షి పేర్కొవడం జరిగింది.

"ఇతి వృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్
పంచభిః సంధి భిస్తస్య విభాగః సంప్రకల్పితః."

వ్యక్తికి ఆత్మ ముఖ్యమే అయినా శరీరం యొక్క అవసరం కూడ ఉంటుంది. అలాగే నాటకానికి ఉతివృత్తం శరీరం వంటిది. అభినవగుప్తుడు వృత్తాన్ని నిర్వచించిన విధం గమనిస్తే "అభినేయమైన కావ్యము 'వృత్తము' (=కథ, Story) శరీరము, అభినేయమైన కావ్యము (దశరూపము)నకు ఇతి ఇతివృత్తము (welknit plot) శరీరము. 'ఇతి' అనగా వివరించబడనున్న పంచసందులతో అలంకరింపబడినది అని అర్థం." ఇతివృత్తం ఆధికారికం, ప్రాసంగికం అని రెండు విధాలు. ప్రధాన ఫలం కలది అధికారికం. దానికంగ భూతమై తదుపకరణార్థమైనదానిని ప్రాసంగిక మంటారు. ఈ ప్రాసంగికం పతాక, ప్రకరి భేదాలతో ద్వివిధం. ఇతివృత్తం మరల ప్రఖ్యాతం, ఉత్పాద్యం, మిశ్రమం అని మూడు విధాలు భారత రామాయణాదులలో ప్రసిద్ధ కథ ప్రఖ్యాతం. కవి కల్పిత ముత్పాద్యం. ప్రసిద్ధమూ కల్పితమూ అయితే మిశ్రమ మనబడుతుంది. పురాణేతిహాసాలలోని వస్తువేకాక చారిత్రకం కూడా ప్రఖ్యాతమే. పైవానిలో ఏదానినైనా గ్రహించి నాటక కర్త సహృదయ ఆనందజనకమైన నాటకంగా రూపొందించవచ్చు. అది నాటక కర్త ప్రజ్ఞాపాటవాల్ననుసరించి జరుగుతుంది.

మతపరమైన ఉత్సవాలతోనూ, దేవాలయాలలో జరిగే తిరునాళ్ళతోనూ నాటక ప్రదర్శనలకు కొంత సంబంధం ఉండడం ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో మనకు కనిపిస్తుంది కాళిదాసు రచించిన విక్రమోర్వశీయ నాటకాన్ని ఉజ్జయినీ నగరంలో మహాకాలనాథుని ఉత్సవంలో ప్రదర్శించేవారు. క్రీడాభిరామ నాటకం కూడా ఈ విధంగా భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శితం కావడం గమనించదగిన విశేషం.

"గట్టుదాటి, పుట్టదాటి, ఘనమైన అడవిదాటి" అన్నట్లు కురువంజి జక్కుల కథ, యక్షగానం, వీధినాటకం, తోలుబొమ్మలాట, పగటివేషాల వంటి జానపదుల రీతులను దాటి, ఒక నిర్దుష్టమైన సాహిత్యప్రక్రియగా, తెలుగునాటకం 19 వ శతాబ్దంలో రూపొందింది. ఈ ప్రక్రియలను పరించి కించిత్తు పరికించడం సమంజసం.[10]

"నాటకం దృశ్య కావ్యం, అంటే రంగస్థలంపై ఆయా పాత్రలవల్ల ప్రయుక్తమైనప్పుడు చూచి ఆనందించదగింది గనుక అందలి భాష సరళమై నాతికఠినమై యుక్తిచమత్కృతితో కథాగమనానికీ, పాత్రల మనఃప్రవృత్తులను వ్యక్తం చేయడానికీ ఉపకరించేలా ఉండడం ఎంతైనా అవసరం. లేకపోతే నాటకం రక్తిగట్టకుండా పోతుంది. తెలుగు నాటకాల్లోని సాహిత్యం కాలానుగుణంగా మార్పు చెందుతూ క్రమ పరిణతి చెందడం మనం గమనించవచ్చు. తొలి తెలుగు నాటకాల్లో వీరగ్రాంథిక భాష అధికారం చెలాయించగా, ఆ తరువాత వికాస దశలోని నాటకాలు పాత్రోచిత భాష, క్రమంగా పద్యగేయాలు లేని కేవల వచనమేగలవిగా వెలసినట్లు తెలుస్తూంది."[11]

1860 సంవత్సరంలో కోరాడ రామచంద్రశాస్త్రిగారి తొలి తెలుగు నాటకం 'మంజరీ మధుకరీయం' వెలువడింది. ఇది సంభాషణాత్మకమై ఉన్నా ప్రబంధమే అనవలసి ఉంది. భాష మిక్కిలి కఠినమై, కవి యొక్క పాండిత్య ప్రకర్షకు నిదర్శనంగా ఉంది. దీర్ఘమైన సంభాషణలు ఉన్నాయి. 1872 లో 'నరకాసుర విజయ వ్యాయోగం'ను అనువదించినవారు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు. వీరు వీరగ్రాంథికవాదులు. వీరి అనువాదం సంస్కృత మూలానుసారంగా ఉంది. 1874 లో వావిలాల వాసుదేవశాస్త్రిగారు 'జూలియస్ సీజర్'

నాటకాన్ని ఆంగ్లంనుంచి తెలుగులోని కనువదించి, 1876 లో ప్రకటించారు. ఇది ఆంగ్ల నాటకానువాదాల్లో మొదటిది. వీరి అనువాదం మూలానుసరణమై, భాష సరళంగా ఉంటుంది. ఆ తరువాత వీరు 'సందకరాజ్యం' అనే సాంఘిక నాటకం రచించారు. ఇది తేటగీతిలో రచించడం విశేషం పద్యనాటక రచనలో వీరు ప్రథములు. భాష సరళంగా ఉండి ప్రశంసలందుకొంది. వీరి 'ఉత్తర రామచరిత్ర' నాటకానువాదం 1880 లో ఆరంభమై, 1883 లో ముద్రణకు నోచుకొంది.

వీరి తరువాత పేర్కోదగ్గ సాహిత్యకారులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు. 1880 లో వీరు షేక్స్పియర్ రచించిన "కామిడీ ఆఫ్ ఎర్రర్స్'ను చమత్కార రత్నావళిగానూ, శ్రీహర్షుని సంస్కృత రత్నావళినీ అనువదించి, ప్రదర్శింపజేశారు. అంతకుముందే 'బ్రాహ్మవివాహము' 'వ్యవహార ధర్మ బోధిని' 'తిర్యగ్విద్వన్మహాసభ మహారణ్య పురాధిపత్యము' అనే ప్రహసనాలు రచించి ప్రకటించారు. ఈ ప్రహసనాలు వినోదం, సంఘసంస్కరణం ప్రయోజనాలుగా పంతులుగారు రచించారు. సంస్కృతంనుంచి అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, ప్రబోధ చంద్రోదయము అనే నాటకాల్నీ; ఆంగ్లంనుంచి వెనీసు వర్తక చరిత్రము, రాగమంజరి, కళ్యాణ కల్పవల్లి అన్న నాటకాల్నీ అనువదించడమే కాక; 1885 లో ప్రహ్లాద, దక్షిణ గోగ్రహణము, 1886 లో హరిచ్చంద్ర అన్న మూడు స్వతంత్ర నాటకాల్నీ రచించడం వీరి ప్రత్యేకత. కందుకూరివారి నాటకాల్లో పద్యసంఖ్య తక్కువ. ప్రహసనాల్లో వ్యావహారిక భాషను వాడి ఉండడం గమనించదగ్గ విషయం.[12]

1880 లో కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనేక వచన నాటకాలు రచించినట్లు తెలియవస్తూంది. కానీ ముద్రితమై లభించిన నాటకం 'వస్త్రాపహరణ' మొక్కటే. 1886 లో అచ్చుపడినా, వడ్డాది సుబ్బారాయుడుగారి 'వేణీ సంహార' నాటకం పేర్కొనదగ్గది. సాహిత్య విషయంగా దీనికెంతో ప్రాధాన్యం ఉంది. హిందుస్తానీ నాటకకర్తగా పేరుగడించిన వీరు తెలుగులో సైతం, 1888 నుంచి హరిశ్చంద్ర, చంద్రహాస నాటకాలను రచింప నారంభించారు. నాటకాలు గద్య పద్యాత్మకాలే గాక, పాత్రోచిత భాషాప్రయోగంతో కూడి ఉండడం వీరి ప్రత్యేకత. ఇది తెలుగు నాటక సాహిత్యంలో తొలిదశ.

ఈ దశలో స్వతంత్ర నాటకాలతోపాటు సంస్కృత, ఆంగ్ల నాటకానువాదాలు వెలసి తరువాతి నాటక రచనకు చక్కటి బాటలను ఏర్పరిచాయి.[13]

రాయలసీమలో తెలుగు నాటక స్వరూప స్వభావాన్ని కొట్టవచ్చినట్లుగా, గద్య పద్య గేయాత్మకమైన నవ్యరీతిలో నాటక రచన ప్రారంభమైంది. తెలుగు నాటక సాహిత్యానికొక రూపకల్పన చేసి అస్తిత్వాన్ని ప్రసాదించినవారు ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు. 1886 లో వీరి ప్రథమ నాటకం 'చిత్రనళీయం' మొదటిసారిగా బళ్ళారిలో ప్రదర్శింపబడింది. తెలుగులో అంతవరకూ లేని విషాద నాటక రచనకు వీరే ప్రథములు. 'విషాద సారంగధర' నాటకాన్ని రచించి, తెలుగు నాటక సాహిత్యానికి ఒక విధమైన పుష్టిని చేకూర్చారు. వీరి నాటకాలు మొత్తం 28 వరకు ఉన్నాయి వీరి నాటకాలు ప్రబంధపక్కీలో నడుస్తాయి. ఇలాగే తెలుగు నాటక సాహిత్యానికి పుష్టిని, తుష్టిని చేకూర్చిన మరో నాటక కర్త కోలాచలం శ్రీనివాసరావుగారు. రామాయణ, భారత ఇతివృత్తాలను గ్రహించి నాటకాలు రచించడమే కాక, 'రామరాజు చరిత్ర' మొదలైన తొమ్మిది చారిత్రక నాటకాల్ని రచించి, 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు'డన్న బిరుదుతో ప్రసిద్ధికెక్కారు. ఆంగ్ల నాటక లక్షణానుసారం విషాదాంతతతోపాటు రంగ విభజనాదుల్ని ప్రవేశపెట్టడమేకాక, శయన, ఆలింగన, చుంబనాదులను ప్రవేశపెట్టారు. వీరి నాటకాలు ప్రబంధ పద్ధతికి మరింత చేరువగా ఉంటాయి. ఇక్కడే పేర్కొనదగ్గ మరో నాటక కర్త ధర్మవరం గోపాలాచార్యులుగారు. వీరి 'రామదాసు' ప్రసిద్ధ నాటకం [14]

"సర్కారు జిల్లాలలోనూ నాటక సాహిత్యం మూడుపువ్వులారుకాయలుగా అభివృద్ధిచెందుతూ వచ్చింది. 1889 లో ఇమ్మానేని హనుమంతరావుగారి ప్రేరణతో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు 'కీచక వధ' నాటకం రచించారు. ఇది కేవలం వచన నాటకం. వీరి నాటకాల్లో 'గయోపాఖ్యానం' చాలా ప్రచారం పొందింది. దీనికి తెలుగు నాటక సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానం వుంది. దీనికంటే 'ప్రసన్నయాదవ' నాటకానికే అధిక ప్రాముఖ్యమిస్తారు చిలకమర్తివారు. కర్ణభారం తప్ప భాసనాటక చక్రాన్ని తెలుగులోనికి అనువదించారు."[15]

1897 లో నాటక సాహిత్యంలో గొప్ప మార్పు రావడం కనిపిస్తుంది. వేదం వెంకటరాయ శాస్త్రి 'ప్రతాపరుద్రీయం', గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' అనే స్వతంత్ర నాటకాలు వెలిశాయి. వ్యావహారిక భాషకు కన్యాశుల్కం ప్రతినిధి కాగా, అంతకు కొంచెం ముందే నాదెళ్ళ పురుషోత్తమ కవిగారి నాటకాల్లో ఆరంభమైన పాత్రోచిత భాషకు 'ప్రతాపరుద్రీయం' ప్రాతినిధ్యం వహించింది. ఈ రెండు నాటకాలకు సాహిత్యంలో సముచిత స్థానముంది. వేదం వారు 'ఉష', 'బొబ్బిలి యుద్ధం' అనే నాటకాల్ని స్వతంత్రంగా రచించడమే కాక, సంస్కృతంలోనుంచి కొన్ని ప్రసిద్ధ నాటకాల్ని తెలుగు చేశారు. వేదం, గురజాడలలో చక్కటి, చిక్కటి హాస్యానికి కొదవలేదు. వేదం వారి నాటకాల్లో పద్యాలేగాని పాటలకు తావులేదు. కన్యాశుల్కంలో సంభాషణలకు, ఉక్తి వైచిత్రికి ప్రాధాన్యం.[16]

అయితే, పానుగంటి లక్ష్మినరసింహారావు గారు గ్రాంథిక, వ్యావహారిక భాషలను రెంటిని సమన్వయించి, లలితమనోహరమైన తెలుగు భాషతో నాటక రచన గావించి ప్రసిద్ధిచెందారు పీరు దాదాపు 30 నాటకాలు రచించారు. నాటకాల్లో వృత్తాలను వాడకూడదని, చదవటానికి అనువైన ఆటవెలది, తేటగీతి మొదలైన జాత్యుపజాతులనే వాడాలని వీరి వాదం. వీరు క్రమంగా కేవలం వచన నాటకాలే రచించారు. సహజ హాస్యప్రియులు కావటంవల్ల, వీరి నాటకాలన్నింటా హాస్యం ఉంటుంది. వీరి నాటక సాహిత్యానికి ఒక విశిష్టత ఉంది.[17]

తిరుపతి వేంకటకవుల నాటకాలు ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించి, ఆంధ్ర ప్రజానీకపు మన్ననకు పాత్రమైన విషయం అందరికి తెలిసిందే. వీరి పాండవోద్యోగ విజయ నాటకం ప్రదర్శనలో మిక్కిలి ప్రచారం పొందింది. వచన నాటకాలు రచించడమే ఉచితమని తలంచబడుతున్న రోజులలో వీరు తమ పద్య రచనాపాటవాన్ని ప్రకటిస్తూ నాటకాల్లో పద్య రచన గావించారు. గయోపాఖ్యానం తరువాత వీరి నాటక పద్యాలను ప్రజలు విరివిగా పాడుకొన మొదలుపెట్టారు. పద్యాల ఆధిక్యంవల్ల వీరి నాటకాలు పద్యాత్మక నాటకాల్లా గోచరిస్తాయి. 'జెండాపై కపిరాజు', 'చెల్లియొ చెల్లకో....,' 'అలుగుటయే యెరుంగని' మొదలైన వీరి పద్యాలు చాలా ప్రచారం పొందాయి. వీరి నాటకాలకు

సాహిత్యంలో సమున్నత స్థానం దక్కింది. తరువాత బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి 'హరిశ్చంద్ర' నాటకానికి చాలా ప్రచారం లభించింది.[18]

సంఘసంస్కరణమే ప్రధానాశయంగా నాటకాలు రచింపబడటం ప్రారంభమైంది. అట్టివారిలో కాళ్ళకూరి నారాయణరావు, సోమరాజు రామానుజరావు ప్రముఖులు. కాళ్ళకూరి వారి 'చింతామణి' ప్రసిద్ధి చెందింది. పద్యాల సంఖ్య అధికం. వీరి నాటకాలు ప్రజాదరణకు నోచుకొన్నాయి. రాను రాను నాటక సాహిత్యంలో అనేక రీతులు వెలిశాయి. ఆంగ్ల వాఙ్మయం ఓ ప్రక్క, జాతీయోద్యమావశ్యకం మరోప్రక్క ప్రజలను ప్రభావితం చేశాయి. దానికి అనుగుణంగా రచనలు రాసాగాయి. సాంఘిక జీవిత విశేషాలను వ్యక్తం చేయగల నాటకాలు వచ్చాయి. అట్టివాటిలో ఆంధ్రులను ఆకర్షించిన శ్రీ పి. వి. రాజమన్నారుగారి 'తప్పెవరిది' ఆత్రేయగారి 'ఎన్. జి. వో' పేర్కొదగినవి.[19] క్రమంగా సంఘంలో వచ్చిన మార్పులకు అనుగుణంగా నాటక సాహిత్యం సైతం మార్పు చెందుతూ వచ్చింది. ఆనాటి సాంఘిక విషయాలలో చెప్పుకోదగ్గ విషయం స్త్రీ స్వాతంత్ర్యం. సావిత్రి వంటి సాహస గాథల వల్ల పతిభక్తితోపాటు, ధైర్యసాహసాలు వారిలో ప్రోత్సహించే అవసరం ఏర్పడింది. 1908 కాలం నాటికి స్త్రీలు పురుషులు కలిసి నాటకాలు వేసే పరిస్థితి ఏర్పడింది.[20]

పందొమ్మిది వందల సంవత్సరం ప్రారంభంలో తెలుగు హాస్యనాటకాలు ప్రారంభమైనాయి. వీరేశలింగం పంతులుగారి ప్రహసనాలు, చిలకమర్తి, పానుగంటి గారల రచనలు, షేక్స్పియర్, మోలియర్, షెరిడన్ నాటకాల అనువాదాలు, కొచ్చెర్లకోటవారి అపవాద తరంగిణి, వేదం వెంకటాచలంగారి విధిలేకవైద్యుడు మొదలైనవి వెలువడ్డాయి. సాంఘిక నాటక రచనతో పాటు వ్యంగ్య హాస్యధోరణిలో సమాజంలోని లోపాలు వేలెత్తి చూపి అపహాస్యం చేసి, సమాజ సంస్కరణకు దోహదం చేశాయి. నాటకం వినోదంగా అనుభవించే కాలం దాటి, 1928 ప్రాంతాలలో నాటకాన్ని వ్యాపారసరళిలో నడిపించాలనే ఆత్రుత సమాజంలో వ్యాపించింది. దీనితో నాటక రచనలోనూ, నాటక ప్రదర్శనలోనూ ఎక్కువ శ్రద్ధ కనబరచి, ఏమాత్రం రసాభాసకు వీలులేకుండా ఉండే నాటకాలు వచ్చాయి.

మానవ జీవితం యాంత్రికంగా మారింది. ఎలాంటి క్లేశమూ లేకుండా, సుఖం పొందాలనే ఆసక్తి మానవునిలో అధికమైంది. దీనితో అనేకమైన నూతన పద్ధతులను నాటకాలలో ప్రవేశపెట్టడం జరిగింది. రాత్రంతా కూర్చొని నాటకాన్ని చూచి ఆనందించేంత ఓపిక మానవునిలో నశించింది. అందుకే కాల వ్యవధిలో మార్పు వచ్చింది. కథాభాగాన్ని పొడిగించకుండా కుదించి. విషయం అవగత మయ్యేలా, నాటక రచనలో మార్పులు వచ్చాయి. ఇతర దేశాలతోటి సంబంధాల కారణంగా అనేక మార్పులు వచ్చాయి.

నాటకాల స్థానంలో రానురాను నాటికలు, ఏకాంకికలు రాసాగాయి. ప్రథమ దశలో ఏకాంకికలు రచించినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, భమిడిపాటి కామేశ్వరరావుగారు, ముద్దుకృష్ణగారు, చింతా దీక్షితులుగారు, గుడిపాటి వెంకటచలంగారు. వీరి ఏకాంకికలకు, నాటికలకు తెలుగు నాటక సాహిత్యంలో స్థానం ఉంది. రేడియో ప్రభావంతో రేడియో నాటికలు వచ్చాయి. పద్య, గేయ, సంగీత, నృత్య నాటికలు వెలిశాయి ఇప్పుడిప్పుడే టెలివిజన్ రాకతో నాటికలకు, ఏకాంకికలకు ఎక్కువ ఆదరణ లభిస్తూ ఉంది. ఇలాగ తెలుగు నాటక సాహిత్యం క్రమ పరిణామం కలిగి, ఏ ఇతర భాషా నాటక సాహిత్యానికి తీసిపోకుండా, సమున్నతమైన స్థానం పొందింది. ఇది ఇంకా వికాస వంతంగా మారగలదని ఆశిద్దాం.[21]

## పాదసూచికలు

1. తెలుగు నాటకం
   డా. ఎస్. గంగప్ప
2. నాటక వికాసం — పుటలు : 146, 147
   డా. పి. ఎస్. ఆర్. అప్పారావు

3. తెలుగు నాటకం — పుటలు : 21, 22
డా. ఎస్. గంగప్ప

4. పైదే

5. పైదే — పుట : 22

6. పైదే — పుట : 12

7. The Drametic History of the world — పుట : 232
కోలాచలం శ్రీనివాసరావు

8. తెలుగు నాటకం
తెలుగు నాటక సాహిత్యం — పుట : 21

9. కోలాచలం శ్రీనివాసరావు
నాటక సాహిత్య సమాలోచనము — పుటలు : 127, 128
డా. ఎస్. గంగప్ప

10. తెలుగు సాహిత్య వికాసం
తెలుగులో నాటకాలు — పుటలు : 123, 124
డా. కె. కె. రంగనాథాచార్యులు

11. తెలుగు నాటకం
తెలుగు నాటక సాహిత్యం — పుట : 21
డా. ఎస్. గంగప్ప

12 పైదే — పుటలు : 21, 22

13. పైదే — పుటలు : 22, 23

14. పైదే — పుటలు : 23, 24

15. పైదే — పుట : 25

16. పైదే — పుట : 25

17. పైదే — పుట : 26

18. పైదే — పుట : 26

19. పైదే — పుట : 26

20. నూరేళ్ళ తెలుగు నాటక రంగం — పుట : 197
మొదలి నాగభూషణ శర్మ

21. తెలుగు నాటకం — పుట : 27
డా. ఎస్. గంగప్ప

# 3. ఆచార్య కొలకలూరి ఇనాక్ – జీవిత దర్శనం

## పుట్టుపూర్వోత్తరాలు :

అసంఖ్యాకమైన రచనల్ని అందిస్తూ, ఆకాశవాణి శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని గావిస్తూ, లలితమై హృద్యమైన శైలితో అశేష పాఠకుల్ని అలరిస్తూ ఉన్న ఆధునిక కవి, విమర్శకుడు, పరిశోధకుడు, నాటకకర్త శ్రీ కొలకలూరి ఇనాక్ గారు. వీరు గుంటూరు జిల్లా వేజండ్ల గ్రామంలో పందొమ్మిది వందల ముప్పై తొమ్మిదవ సంవత్సరం, జూలై నెల, ఒకటవ తేదీన జన్మించారు. (1-7-1939.)

కొలకలూరి రామయ్యగా పిలువబడి, వివాహానంతరం కొలకలూరి శాంసన్‌గా స్థిరపడిన వారి శ్రీమతి విశ్రాంతమ్మ. ఈమె వివాహానికి పూర్వం వీరమ్మగా పిలువబడేది. ఈ పుణ్యదంపతుల ముద్దుబిడ్డ శ్రీ కొలకలూరి ఇనాక్. శ్రీ ఇనాక్‌గారు ప్రస్తుతం అనంతపురంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

## విద్యాభ్యాసం :

శ్రీ కొలకలూరి ఇనాక్‌గారి బాల్యం వేజండ్లలో గడచింది. వీరి ప్రాథమిక విద్య ఏ.బి.యం. ప్రైమరీ స్కూల్ - వేజండ్లలో 1944-48 వరకు, ఉన్నత విద్య గుంటూరులోని యు.ఎల్.సి.యం. హైస్కూల్‌లో, కళాశాల విద్య గుంటూరులో ఎ.సి. కళాశాలలో 1954-56 వరకు సాగింది. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నుండి 1956-59 లో బి.ఏ ఆనర్సు పట్టభద్రులయ్యారు.

## పరిశోధనాంశం :

'తెలుగు వ్యాస పరిణామం' వీరి పరిశోధనాంశం. 1968 నుండి 1972 వరకు అధ్యాపక విద్యార్థిగా ఉండి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ పట్టభద్రులయ్యారు.

**ఉద్యోగం :**

వీరు 1959 సంవత్సరంలో ఏ. సి. కళాశాల గుంటూరులో తెలుగు లెక్చరర్‌గా చేరి, 1961 వ సంవత్సరం వరకు అక్కడ పని చేశారు. 1961 లో ప్రభుత్వ కళాశాల చిత్తూరులో, 1962 సంవత్సరం పి.ఆర్. కళాశాల కాకినాడలో, 1962 నుండి 1972 వ సంవత్సరం వరకు ప్రభుత్వ కళాశాల అనంతపురంలో, 1972 నుండి 1974 వరకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రంలో, 1974 నుండి 1977 వరకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం కళాశాల-తిరుపతిలో లెక్చరర్‌గా, 1977 మొదలు 1981 వ సంవత్సరం వరకు అటానమస్ పి.జి. సెంటర్- అనంతపురంలో రీడర్‌గా, 1982 నుండి శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం-అనంతపురంలో ఆంధ్రాచార్యులుగా, ప్రిన్సిపాల్‌గా, డీన్‌గా వివిధ స్థాయిల్లో పని చేశారు. ప్రస్తుతం అక్కడే ఆంధ్రాచార్యులుగా పదవిలో ఉన్నారు.

## నాటకకర్త వైయక్తిక జీవితం

**వివాహం :**

అభ్యుదయ భావాలు గల రచయిత ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు కులం, మతం, వర్గం, ధనిక, పేద, శరీరచ్ఛాయ మొదలైన వాటితో పట్టింపులు లేని సమతావాదిగా కనిపిస్తారు. చదువుకొనేరోజులనుంచి ప్రగతిశీల దృక్పథం కలిగిన వ్యక్తి అని మిత్రులు చెబుతుంటారు. వివాహం అంటే స్త్రీ పురుష సంబంధం. ఈ సంబంధం ఎలా ఉండాలి అన్న విషయమై రచయితను ప్రశ్నించగా "స్వేచ్ఛా సమానత్వం ప్రాతిపదికలుగా స్త్రీ పురుష సంబంధాలు ఉండాలి. సాంప్రదాయక జీవితంలో అవి ఉండవని కాని, రూపాంతరం చెంది ఉంటాయని కాని అంటే అనవచ్చు కాని, స్వేచ్ఛా సమానత్వ నేపథ్యంలేనిదే స్త్రీ పురుష సంబంధాలు సక్రమంగా ఉండవు అన్నారు."1 ఈయన వర్ణాంతర వివాహం చేసుకున్న అభ్యుదయవాది. వీరి శ్రీమతి కె. భగీరథమ్మగారు - వివాహ సమయంలో స్త్రీ శిశు సంక్షేమ శాఖలో లైజన్ ఆఫీసర్‌గా ఉండేవారు. ప్రస్తుతం వీరు అదే శాఖలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా పని చేస్తున్నారు. వీరిది ప్రేమ వివాహం. శ్రీమతి భగీరథమ్మగారి తల్లిదండ్రులకు ఇష్టంలేక

పోయినా శ్రీ ఇనాక్‌గారి తల్లి పూనుకొని, వివాహం జరిపించి, తన అభ్యుదయ భావాలను ఆనాడే సంఘానికి చాటి చెప్పింది.

## సంతానం :

శ్రీ కొలకలూరి ఇనాక్‌గారికి నలుగురు సంతానం. పెద్దమ్మాయి ఆశా జ్యోతి. ఎమ్.ఏ. పిహెచ్.డి. పూర్తిచేసి, బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్నారు. రెండవ సంతానం శ్రీ కె. శ్రీకిరణ్ బి. టెక్ పూర్తిచేసి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో యం.బి.ఏ. చేసి, యల్.ఐ.సి - శివకాశిలో అసిస్టెంటు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరుగా ఉన్నారు. మూడవ సంతానం మధుజ్యోతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎమ్.ఏ. తెలుగు చేసి, ఇటీవల శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగులో పరిశోధన చేసి, శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరరుగా ఉన్నారు. నాలుగవ సంతానం శ్రీ కె. సుమకిరణ్ శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషులో ఎం.ఏ. చేశారు. వీరందరిని మంచి చదువులు చదివించటం రచయితకుగల అభిరుచిని తెలియజేస్తుంది. తల్లిదండ్రుల అభిరుచులకు తోడుగా పిల్లలు చురుకైనవాళ్ళుకావడం విశేషం.

## మిత్రులు :

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డిగారితో మంచి స్నేహం ఉంది. అలాగే ఎందరో విశ్వవిద్యాలయ ఆచార్యులతోను, కళాశాల అధ్యాపకులతోను, ప్రముఖులైన ఉపాధ్యాయులతోను, రాజకీయవేత్తలతోను, ఇంకా అనేకమందితో సత్సంబంధాలు ఉన్నాయి. డా. బెజవాడ గోపాలరెడ్డి, దేవులపల్లి రామానుజరావు, డా. బోయి భీమన్న, మోదుకూరి జాన్సన్, డా. మొదలి నాగభూషణ శర్మ, ఆచార్య తూమాటి దొణప్ప, కీ. శే. దామోదరం సంజీవయ్య, డా. మర్రి చెన్నారెడ్డి, ఎన్. టి. రామారావు, ఆచార్య వి. రామచంద్ర చౌదరి, కీ.శే. ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఆచార్య ఎస్. గంగప్ప మొదలైన ఎందరో ప్రముఖులతో సన్నిహితమైన మైత్రి ఉంది.

## దళితవర్గాల ఉన్నతికి కృషి :

శ్రీ కొలకలూరి ఇనాక్‌గారు సమసమాజ స్థాపన కృషిలో దళిత వర్గాల వారి అభ్యున్నతికి ఎంతగానో కృషి చేస్తున్నారు. కులం పేరుతోనో వర్గం పేరుతోనో అట్టడుగున పడి కొట్టుమిట్టాడుతున్నటువంటివారికి చేయూతనిచ్చి, గాలిలోని దీపానికి ఆశ్రయం కల్పించే విధంగా వారి ప్రతిభకు సానబట్టి వజ్రంలా తయారు చేస్తున్నారు. వీరు అనంతపురంలో శ్రీకృష్ణదేవరాయ విద్యాభివృద్ధి సంస్థ స్థాపించి, దాని కార్యదర్శిగా, సంచాలకులుగా పనిచేశారు. షెడ్యూల్డ్ జాతులు, తెగలు, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు మంచి శిక్షణ ఇచ్చి, రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం నిర్వహించే వివిధ స్థాయీ పరీక్షలలో ఉత్తీర్ణులు కావటానికి సహకరించారు. వీరు అంబేద్కర్ విజ్ఞాన పీఠం అధ్యక్షులుగా పని చేస్తున్నారు.

## సాహిత్యసంస్థలతో సంబంధాలు :

శ్రీ ఇనాక్‌గారు అనేక సాహిత్య సంస్థలతో సంబంధాలు కలిగి వివిధ హోదాలలో పనిచేస్తున్నారు. 'అనంతపురం జిల్లా రచయితల సంఘం' ఉపాధ్యక్షులుగా 1969 నుంచి 1974 వరకు, అదే సంస్థకు అధ్యక్షులుగా 1980 నుంచి 1985 వరకు పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సలహా సంఘం సభ్యులుగా 1974 నుంచి 1978 వరకు పనిచేశారు. సాధారణ సభ్యులుగా 1978 నుంచి 1984 వరకు, పాలకమండలి సభ్యులుగా 1983 మొదలు 1984 వరకు పనిచేశారు. ఇప్పుడు కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా ఉన్నారు. వీరు గత పది సంవత్సరాలుగా అనేక సాహిత్య గోష్ఠులను నిర్వహించి ప్రసిద్ధి చెందారు. అందులో ప్రధానమైనది 1987 జనవరిలో వీరు నిర్వాహక కార్యదర్శిగా 15 వ జాతీయ ద్రావిడభాషా శాస్త్రవేత్తల గోష్ఠి కార్యక్రమాన్ని శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఘనంగా నిర్వహించారు. వీరు అడ్వయిజర్‌గా యూనివర్శిటీ విద్యార్థుల సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహించారు. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం బోర్డ్ ఆఫ్ స్టడీస్, సెనెట్, అకడమిక్ కౌన్సిల్, సిండికేట్ సభ్యులుగా ఎన్నో మహత్తరమైన బాధ్యతలను సక్రమంగా నిర్వహించాచు. వీరు శ్రీకృష్ణదేవరాయ విద్యాభివృద్ధి సంస్థ (అనంతపురం) డైరెక్టర్‌గా పనిచేశారు. గుల్బర్గా, బెంగుళూరు, మైసూరు, నాగార్జున, ఆంధ్రా మొద

లైన విశ్వవిద్యాలయాలలో బోర్డు ఆఫ్ స్టడీస్ సభ్యత్వాన్ని కలిగి ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం సభ్యులుగా పనిచేశారు. తెలుగు విశ్వ విద్యాలయం పాలకమండలి సభ్యులుగా పనిచేశారు.

## సాహిత్యసృష్టి :

సాహిత్యం అనేటప్పటికి ప్రాచీన సాహిత్యమా? ఆధునిక సాహిత్యమా? అన్న ప్రశ్న కలుగుతూ ఉంటుంది. "ప్రాచీన సాహిత్యం అంటే ఆధునిక సాహిత్యం కానిది. ఆధునిక సాహిత్యం తెలుగులో 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రారంభమైనట్లు భావిస్తే, అంతకు ముందటిది తెలుగులో ప్రాచీన సాహిత్యం."[2] తెలుగు సాహిత్యమే జీవితం అయిన వీరికి ఏ సాహిత్యమైనా ఇష్టమే. అయితే, ఆధునిక సాహిత్యం అభిమాన విషయం. ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో రచయితగా, పరిశోధకులుగా వీరి కృషి ఉంది. ఆధునిక సాహిత్యం ఎందుకు అభిమాన విషయం అని ప్రశ్నిస్తే వీరి సమాధానం- "ప్రాచీన సాహిత్యంకంటె ఎక్కువగా ఆధునిక సాహిత్యం సమాజ జీవితానికి సమీపంగా ఉండటంవల్ల. సమాజానికీ, సాహిత్యానికీ పూర్వం ఎప్పుడూ లేనంత అధికంగా ఇప్పుడు సంబంధం ఉంది. ఈ ఉండటం ఆధునిక సాహిత్య లక్షణం. అందువల్ల ఆధునిక సాహిత్యం అంటే అభిమానం"[3] అని పేర్కొన్నారు. ఆధునిక సాహిత్యంలో వివిధ ప్రక్రియలు మనకు కనిపిస్తాయి. "ఒక్కొక్క ప్రక్రియ ఒక్కొక్క విధానంలో సాగుతుంది. ఒక్కొక్క విధానం ఒక్కొక్క భావానికి అనుకూలంగా ఉంటుంది. ఒక భావం అభివ్యక్తం కావటానికి ఏ ప్రక్రియ అనుకూలంగా ఉంటే ఆ ప్రక్రియ రూపొందుతుంది"[4] అని అన్నారు. రచయితగారికి అన్ని ప్రక్రియలూ ఇష్టమే. "చెప్పదలచుకున్న విషయాలు వివిధంగా ఉంటాయి. ఒక్కొక్క విషయానికి ఒక్కొక్క ప్రక్రియ అనుకూలంగా ఉంటుంది. ఆ అనుకూలతనుబట్టి ప్రక్రియ గ్రహించటం జరుగుతుంది"[5] అని వివరించారు.

## కవిత్వం :

ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు 1954 నుంచి సాహిత్యం సృష్టిస్తున్నారు. అనేక కవితలను రచించారు. వీటిలో కొన్ని ప్రచురణకు, కొన్ని ఆకాశవాణిలో ప్రసారానికి నోచుకొన్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ప్రభుత్వం,

ఆకాశవాణి వారు నిర్వహించిన కవి సమ్మేళనాలలో వీరికి అనేక సందర్భాలలో సన్మానాలు జరిగాయి. ఇతర సాహిత్య కార్యక్రమాలలో కూడ వీరికి సన్మానాలు జరిగాయి. వీరు మూడు కవితా సంపుటాల్ని ప్రచురించారు. అవి 1. ఆశాజ్యోతి 2. షరా మామూలే 3. కులం-ధనం.

## నవలలు :

వీరు అనేక నవలలను రచించారు. అందులో ఏడు నవలలు ప్రచురణ పొందాయి. వీటిలో అనేకాలు సీరియల్స్‌గా అనేక పత్రికలలో ప్రచురింప బడ్డాయి. పై విధంగా ప్రచురించిన వాటిలో 'అనాథ' నవలకు 1961 లో ఆంధ్ర ప్రభ నిర్వహించిన నవలల పోటీలో బహుమతి లభించింది. వీరి నవలల్లో మిగ తావి 'రెండు కళ్ళు - మూడు కాళ్ళు' 'సమత' 'సౌందర్యవతి' 'ఎక్కడుంది ప్రశాంతి?' 'సౌభాగ్యవతి' 'ఎడారులలో విరులు.'

## నాటకాలు - నాటికలు :

వీరు స్వయంగా నటులు. నటుడైన వ్యక్తి నాటక రచనకు పూనుకోవడం చాల అరుదు. అటువంటిది జరిగితే- ఆ నాటకం అన్నికోణాలనుంచి ఔన్నత్యాన్ని పొందడమే కాక అందరి మన్ననలను చూరగొంటుంది. ఈ రచయిత మూడు నాటకాలను ప్రచురించారు. అందులో 'మునివాహనుడు' నాటకం ఇంటర్మీడియేట్ విద్యార్థులకు 1985 మొదలుకొని 1988వ సంవత్సరందాకా పాఠ్యగ్రంథంగా ఉంది. వీరి నాటకాలు, నాటికలు అనేక సందర్భాలలో రేడియోలో ప్రసారం చేశారు. 1988 లో తెలుగు సాహిత్య అకాడమీ కార్యక్రమంగా తెలుగు విశ్వవిద్యా లయం ఉత్తమ నాటకం బహుమతిని "మునివాహనుడు" పొందింది.

వీరు నాటకాలలో నటించడమే కాకుండా నాటక దర్శకత్వాన్ని నిర్వ హించటమేకాక ప్రదర్శనకు, ప్రసారానికి యోగ్యంగా ఉండే నాటక నాటికల వ్రాశారు. వీరి ఇతర నాటకాలు 'క్రీ' 'జైహింద్.' వీరి నాటికల సంకలనాలు 'దృష్టి' 'అభ్యుదయం' 'జ్యోతి' మొదలైనవి.

## కథలు - కథానికలు :

ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు కథానికా రచయితగా గొప్ప ఖ్యాతి గడించారు. వీరు నూటయేబది కథానికలను వివిధ పత్రికలలో ప్రచురించారు. వీటిలో కొన్ని ఆకాశవాణిలో కూడ ప్రసారమైనాయి. వీరు నాలుగు కథానిక సంపుటాలను ప్రచురించారు. వీటిలో కొన్నింటికి విశ్వవిద్యాలయం అవార్డులు కూడా లభించాయి. 1986 వ సంవత్సరంలో 'ఊరబావి' కథానిక సంపుటికి తెలుగు సాహిత్య అకాడమీ కార్యక్రమంగా తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు వచ్చింది. వీరి కథానికలు కొన్ని ఆంగ్లం, హిందీ, కన్నడం, తమిళం మొదలైన భాషల్లోనికి అనువదింపబడ్డాయి. అవి ఆయా భాషలలోని పత్రికలలో ప్రచురితమయ్యాయి. కథానిక సంపుటులు 'గులాబి నవ్వింది' 'భవాని' 'ఇదా జీవితం' 'సూర్యుడు తలెత్తాడు' అనేవి వెలువడ్డాయి. వీరి కథలలో 'తల లేనోడు' అనే కథ 1987-1995 దాకా ద్వితీయ సంవత్సరం ఇంటర్మీడియట్ విద్యార్థులకు పాఠ్యాంశంగా ఉంది.

## వ్యాసాలు :

అభ్యుదయవాది సమసమాజ స్థాపన భావన ఉన్న శ్రీ కొలకలూరి ఇనాక్ గారు అనేక సృజనాత్మకం, విమర్శనాత్మకం అయిన వ్యాసాలను పత్రికలలో వివిధ సంకలనాలలో ప్రచురించారు. 'ఆంధ్ర కావ్యాలలో అవతారికలు' 'అమరావతి' 'ముసలమ్మ మాహాత్మ్యం' 'సాంఘిక నవల-సమాజం' 'జాషువా-మానవత' 'విప్లవ సాహిత్య విమర్శ' 'తెలుగు నవలల్లో జనరంజన ధోరణులు' మొదలైన సాహిత్య వ్యాసాలు ఎన్నో రచించారు.

## ఉపన్యాసాలు :

ది డైరెక్టరేట్ ఆఫ్ కల్చరర్ అఫైర్స్ ఆఫ్ గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్ర ప్రదేశ్ వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని వివిధ జిల్లా కేంద్రాలలో 'ఆంధ్ర సంస్కృతి - తెలుగు నాటకం', 'ఆంధ్ర సంస్కృతి-తెలుగు సంగీతం', 'ఆంధ్ర సంస్కృతి-శిల్పం' మొదలైన విషయాల మీద ప్రసంగించారు. విశ్వ విద్యాలయ స్థాయిలో అనేక సందర్భాలలో ప్రసంగించారు. 'కన్యాశుల్కం-రచనా శిల్పం' 'తెలుగు వ్యాసం-విమర్శ', 'తెలుగు నవల-వికాసం' మొదలైనవి పేర్కొనవచ్చు.

యు.జి.సి. ఆధ్వర్యంలో నిర్వహింపబడే కార్యక్రమాలలో అనేక విషయాలపై ప్రసంగించారు. ఉదాహరణకు 'తెలుగు సాహిత్యం - స్త్రీల జీవితం', 'తెలుగు సాహిత్యం-సామాన్య మానవుడు', 'తెలుగు నవల-మనోవిశ్లేషణం' మొదలైనవి.

ఈ విధంగా ఆకాశవాణిద్వారా కూడా అనేక విషయాలపై వీరు ప్రసంగించారు ఇలా సాహిత్య గోష్ఠి ప్రసంగాలు జాతీయ గోష్ఠి ప్రసంగాలు చాలా ఉన్నాయి.

## అనువాదాలు :

ఆధునిక ఆంధ్ర భాషలోనికి బైబిలును అనువాదం చేశారు. దీనిని ఇంటర్‌నేషనల్ బైబిల్ ట్రాన్స్‌లేటర్స్, టెక్సాస్, యు. యస్. ఏ. వారు 1985 వ సంవత్సరంలో ప్రచురించారు.

## ఇతర రచనలు :

'తెలుగు వ్యాస పరిణామం' పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథం, వ్యాసాలు పరిశోధన పత్రాలు సంకలనాలుగా 'తెలుగు వ్యాసాలు' 'సాహిత్య దర్శిని' 'సమీక్షణం' వెలువడ్డాయి.

## విదేశీ పర్యటనం :

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు హైదరాబాద్ నగరంలో 1976 లో నిర్వహించారు. తరువాత రెండవ ప్రపంచ తెలుగు మహా సభలు మలేషియాలోని కౌలాలంపూర్‌లో జరిగాయి. శ్రీ ఇనాక్ గారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆహ్వానాన్ని పురస్కరించుకొని కౌలాలంపూర్‌లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో పాల్గొన్నారు. తృతీయ ప్రపంచ మహా సభలకు మారిషస్ ప్రభుత్వ ప్రతినిధిగా ఆహ్వానం పొందినా - వీరు పోలేక పోయారు.

## బహుమతి పురస్కారాలు :

సాహిత్య ప్రియులు కళారాధకులు శ్రీ ఇనాక్‌గారు వివిధ సాహితీ ప్రక్రియలను చేపట్టి తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు. వీరు రచించిన

నాటిక 'దృష్టి' అనే దానికి 1958 వ సంవత్సరంలోను, 'జైహింద్' అనే నాటకానికి 1965 వ సంవత్సరంలోను, 'ఊరబావి' అనే కథాసంపుటికి 1986 వ సంవత్సరంలోను, 'మునివాహనుడు' అనే నాటకానికి 1988 వ సంవత్సరంలోను అవార్డులు లభించాయి. వీరు వివిధ సాహిత్య సాంస్కృతిక సంఘాలచేత, ప్రభుత్వంచేత అనేక సందర్భాలలో సత్కారాలు పొందారు.

అయితే, ప్రముఖంగా చెప్పుకోదగ్గ సత్కారాలు మరువలేనివి, మరువరానివి కొన్ని ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఇటీవల హైదరాబాద్ నగరంలో ట్యాంక్‌బండ్‌మీద కొన్ని శిలావిగ్రహాలను ప్రతిష్ఠించారు. వాటిని ప్రముఖులైన వ్యక్తులచేత ఆవిష్కరింపజేశారు. అందులో కవయిత్రి మొల్ల విగ్రహాన్ని శ్రీ కొలకలూరి ఇనాక్‌గారు ఆవిష్కరించారు.

రెండవది ప్రపంచ తెలుగు మహాసభలు మొదటిసారిగా హైదరాబాద్ నగరంలో, రెండవసారి మలేషియాలోని కౌలాలంపూర్ నగరంలో జరిగినపుడు, రెండు సందర్భాలలో నాటక రచయిత పాల్గొని సత్కరింపబడడం విశేషం.

వీరు కవి సమ్మేళనాలలో, సాహిత్య జాతీయ సాహిత్య గోష్ఠులలో పాల్గొని వివిధ ప్రముఖ సాహిత్య సంస్థలచేత సత్కరింపబడ్డారు.

విద్య గురించి అడిగితే - "విద్య ఉద్యోగం కోసం అనుకొంటే దాని ప్రాంగణం వేరు. విద్య మానవుణ్ణి మాధవుణ్ణి చేస్తుందనుకొంటే దీని పరిసరం వేరు. మనిషిని - ప్రాచీనతలోనుంచి ఆధునికతలోనికి, అడవిలోనుంచి నగరంలోనికి, భూమిమీదనుంచి చంద్రమండలానికి నడిపించేదే కాదు - హింసనుంచి అహింసకు, అరాచకం నుంచి సువ్యవస్థకు, యుద్ధం నుంచి శాంతికి, క్రౌర్యం నుంచి ప్రేమకు నడిపించేది విద్య. విద్య ప్రాంగణం జీవితం అంత విశాలం"[6] అని రచయిత అంటారు కవికి సమాజానికివున్న సంబంధం గురించి ప్రశ్నిస్తే- "స్థూలంగా చెబితే సమాజంలోని పౌరుడు కవి సమాజానికి తోవ చూపే బాటసారి కవి ఈ మాత్రం స్పష్టమైతే మీరు చాలా చెప్పగలరు"[7] అని అంటారు. కవిగారు ప్రభుత్వ సహాయంకంటే ప్రజల దోహదం విశిష్టమైందిగా, కోరుకోదగిందిగా భావిస్తారు. "కవి వర్తమాన సమాజ సందర్శనంలో సాధించే సాఫ

జిక దృష్టి భవితవ్యంలోకి ప్రసరించినపుడు, అది భవిష్యత్తుకి మార్గదర్శకం కావచ్చు"[8] అన్న వీరి మాటలు వీరి రచనలద్వారా నిరూపితాలవుతున్నాయి.

ఈ విధంగా జనపీఠ్ అవార్డు, రాజాజీ అవార్డు, సాహిత్య అకాడమీ బహుమతులు పొందిన రచయిత ఆధునికాంధ్ర కవిత్వం, నాటకం, సాహిత్య సంస్కృతులకు సేవ చేశారు. వచన కవిత్వం, సరళమైన భాషలో, మానవతా దృష్టితో, సమసమాజ స్థాపన లక్ష్యాలతో రచనలు చేశారు. సామాజిక స్పృహ వీరి రచనలలో గోచరిస్తుంది. అభ్యుదయం, ప్రగతిపథం, దళితవర్గాభ్యున్నతి, ప్రపంచ శాంతి, మానవత్వం, ఆంధ్రత్వం, భారతీయ తత్వం వీరి రచనలలో ప్రముఖంగా కనిపిస్తుంటాయి. క్రాంతదర్శి అయిన అభ్యుదయ రచయితగా వీరు కీర్తి ప్రతిష్టలు పొందుతున్నారు.

## పాదసూచికలు

1. రచయితతో ముఖాముఖీ
2. పైదే
3. పైదే
4. పైదే
5. పైదే
6. పైదే
7. పైదే
8. పైదే

# 4. మునివాహనుడు పరిశీలనం–లక్షణ సమన్వయం

## ఇతివృత్తం :

నాటకానికి కథ మూలం. దీనినిబట్టే శిల్పి బంగారాన్ని అందమైన ఆభరణంగా రూపొందించినట్లు కవి నాటకాన్ని సృష్టింపగలడు. మునివాహనుడు నాటకంలో ఉన్న కథ వైష్ణవ మత సాహిత్యంలో సుప్రసిద్ధమైంది. ఇది పన్నిద్దఱాళ్వార్లలో ఒకడైన తిరుప్పాణ్ ఆళ్వారు జీవిత గాథకు సంబంధించింది. పవిత్రత, యోగ్యత అనేవి జన్మ వలన సిద్ధింపవు; అవి కర్మ వలన వస్తాయి అనే సత్యాన్ని ఈ నాటకంలో రచయిత నిరూపించారు.

ఆళ్వారుల తత్త్వానికి భంగం వాటిల్లకుండా జాగ్రత్తపడటం మనం గమనించవచ్చు. "ఆళ్వారులు భక్తి పారవశ్యములోనుండి భగవంతుని అనంత దివ్యమంగళవిగ్రహాన్ని వారి మనోనేత్రములతో తిలకించుచు తన్మయభావంతో భగవంతునితో నేరుగా సంభాషించుచు భగవంతున్ని బిగ్గరగా గంభీరంగా దివ్య కీర్తనలతో సంకీర్తనం గావిస్తూ ఆనంద సాగరములో మునిగి తేలుతూ వుండే తేజోమయులు"[1] అని పేర్కొబడింది.

పై విషయాన్ని నాటకం అంతటా చూపించటంలో నాటక కర్త కృతకృతులయ్యారు. ఉదాహరణకు ప్రథమాంకం ప్రారంభంలో "సరేలేరా రంగనాథా, సత్య వాక్యము తెలుపుమా"[2] అని చెప్పబడింది. వేదవేద్యుడు ప్రథమాంకంలో "దేవదత్తా! తిరుప్పాణ్ కంఠ మాధుర్యము నీకు శ్రవణ గతమయినదా లేదా?"[3] అనినప్పుడు ఇట కంఠమాధుర్యం పేర్కొవటం ఉంది. అలాగే ద్వితీయాంకంలో దేవదత్తుడు "పీడేల పలుకును స్వామి! పొగరు, కండకావరము" అంటే. వేదవేద్యుడు "ఎంతటి భక్తి పారవశ్యమో!"[4] అంటాడు.

సమాజోద్ధరణకు పాటుపడే వ్యక్తిగా రచయిత భక్తి ప్రపత్తి మొదలైన భావాలు లేకుంటే నైతిక జీవితం నిలువదని గ్రహించి, వాటికి నాటకంలో ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటం కనిపిస్తుంది. భక్తి ప్రపత్తులే మానవులలో స్వార్థ రహిత భావాన్ని, నిరాడంబరత్వాన్ని, భూత దయని, అఖిల మానవ సౌభ్రాతృత్వాన్ని పెంపొందిస్తాయి. ఈ దృష్టితో నాటక కథను తీర్చిదిద్దారు.

వ్యక్తుల మధ్య, సంఘాల మధ్య, జాతుల మధ్య, దేశాల మధ్య శాంతి నెలకొనాలంటే వ్యక్తుల్లో స్వార్థం నశించాలి అనేది ఇందులో గోచరిస్తుంది.

"ఆళ్వారుల నుండి గ్రహించే విషయమేమంటే- వర్ణ, జాతి, భాషా భేదాలకు మానవుడు అతీతుడై, లోక కల్యాణగుణప్రపూర్ణుడై మెలగి, ఆనందంగా ఉండాలి. ఇందు వృత్తికి ప్రాధాన్యత లేదు. యజ్ఞ యాగాలకు, ఆచారాలకు కట్టు బొట్లకు, జుట్లకు ప్రాధాన్యం లేదు. లోక కల్యాణార్థం స్వార్థ రహిత జీవితం గడుపుతూ అనిర్వచనీయం అయిన వైష్ణవ శక్తి గుణ గానం చేసి ప్రపత్తుడై ఆనందంతో తేలియాడుతూ వుండాలి."[5]

పైన చెప్పిన విషయాలన్నింటినీ నాటకంలో జాగరూకతతో చెప్పటం గమనించవచ్చు.

నాటక ప్రారంభం లోనే తిరుప్పాణ్ భక్తి ప్రపత్తులను పేర్కొనటం, ఆ తరువాత వేదవేద్యుడు దేవదత్తుల సంభాషణల మూలంగా, భక్తి కోకిల పంచమ స్వరం మైమరపించేట్లుగా ఉందని, తిరుప్పాణ్ భక్తి పారవశ్యం పరమోత్కృష్టం అంటూ ఈ తీరున తిరుప్పాణ్‌కు సంబంధించిన విషయం చెప్పబడింది.[6]

ద్వితీయాంకంలో లోకసారంగముని, అతని మత మౌఢ్య స్వభావం చెప్పి, రెండు భిన్న భావాలకుమధ్య వాద ప్రతివాదాలను కల్పించి కథను పతాక స్థాయికి తీసుకుపోవటం కనిపిస్తుంది. ఆ తరువాత భగవంతునికి లోక సారంగమునికి జరిగిన వాదోపవాదాలు, లోకసారంగమునిలో వచ్చిన మార్పు, తిరుప్పాణ్ భక్తిని గుర్తించటం, అతణ్ణి తన భుజాలమీద మోసుకొనిపోవటం నాటకంలో కథాభాగాన్ని పొందుపరచిన తీరుగా ఉంది.

హరిజనోద్ధరణం అనే అంశాన్ని ఇందులో కవి ప్రత్యేకంగా చెప్పటానికి పూనుకున్నట్లుగా కనిపిస్తుంది. కథావస్తువు స్వీకరించటంలోనే పీరి నేర్పు కాన వస్తుంది. పన్నిద్దరాళ్వారులలో తిరుప్పాణ్ పంచమ కులజుడు. ఇతనికి బ్రాహ్మణ వీధిలోకి, దేవాలయంలోకి ప్రవేశం లేదు. పంచమ కులజుడైన తిరుప్పాణ్‌కు ఆలయ ప్రవేశం చేయాలనే కోరిక కలిగింది. ఏ నాటికి అయినా అది తప్పక ఫలిస్తుందనే నమ్మకం ఉంది. "ఏనాటికయినా మీకు దయ కలుగుననియు నా కాలయ ప్రవేశము జరుగుననియు తెలియును"[7] అని పేర్కొనబడింది. ఒక హరిజనునికి ఆలయ ప్రవేశం చేయాలనే కోరిక కలగటం- అది ఆనాటికి ఒక విప్లవం. ఇది నెరవేరాలని రచయిత కోరటం అభ్యుదయవాదానికి నిదర్శనం.

ప్రథమాంకంలో పంచమ కులజుని ప్రస్తావన ఇలా ఉంది: "మధుర గాయకుడు, మహాభక్తుడు తిరుప్పాణ్‌ను నీవు చూడలేదా?" అని వేదవేద్యుడు అనగా- "పంచముడు మహాభక్తుడా? మహా గాయకుడా? అశుభం" అని ద్వేషంతో దేవదత్తుడు అంటాడు.[8] వేదవేద్యుడు "తిరుప్పాణ్ చదువు సంధ్యలు లేని పంచముడు అయినను మధుర కవి; సరిగమలు రాకున్నను మహా గాయకుడు; శ్రీ రంగేశుని చూడకున్నను మహాభక్తుడు. ఇది దైవలీల."[9] అని చెప్పగా దేవదత్తుడు వినలేక "అదొక గానమా? దానికొక మాధుర్యమా? స్వరమున్నదా? అది పంచముని స్వరము. అతడు భక్తుడగుట నీకెట్లున్ననూ నేను వినలేను"[10] అని సమాధానం ఇస్తాడు.

తిరుప్పాణ్ పంచమ కులంలో పుట్టినా అతని భక్తి భరితాలు అయిన మధుర గీతాల్ని మనం వ్రాసి ఉంచుట మంచిది అని వేద వేద్యుడు అంటాడు. దానికి సమాధానంగా దేవదత్తుడు అవి గాలికి పోవలసిందే. మధుర భావాలు కలుషితం అయిపోతున్నాయి అంటాడు.[11]

అయితే, పై మాటలన్న దేవదత్తుడు పంచమాంకంలో "అవి పాటలా? స్వర్గంగా తరంగాలు. నాకధునీ శీకరాలు. నేను ఆ పాటలను అక్షర బద్ధం కావించెదను. అవి భవిష్యజ్జనాళికి విష్ణుపాదోజ్వల సాహిత్య సంప్రదాయ వారసత్వ సౌందర్యాలు"[12] అని అంటాడు. ఈ మార్పు అకస్మికంగా కలిగింది కాదు. ఈ రెండు అంకాలకు మధ్య మూడు అంకాలలో క్రమ పరిణామం జరిగింది. రచయిత ఇక్కడ ఔచిత్యాన్ని పాటించటం కనిపిస్తుంది.

లోకసారంగముని తిరుప్పాణ్‌ను తాకినందుకు వేదవేద్యుని వెలివేస్తాడు. అదే లోకసారంగముని తిరుప్పాణ్‌ను తను భుజాల మీద మోసుకొని ఆలయంలోకి ప్రవేశిస్తాడు. ఈ పరిణామం ఒక్కసారిగా జరిగింది కాదు. ఇది రచయిత కోరే మార్పు.

## సన్నివేశాలు :

రచయిత నాటకంలో సన్నివేశాలను కల్పించి నాటకాన్ని రసవత్తరంగా తీర్చిదిద్దుతాడు. "ఇతివృత్త నిర్మాణ దక్షతతోపాటు సన్నివేశములను కల్పించి పాత్రపోషణ చతురముగా చేయుటయందు నాటక కర్తకు సామర్థ్యముండి తీర వలయును. సన్నివేశములమీదనే నాటక మాధారపడి యుండును. కథా వస్తు వందరెరిగినదేయైనను ఉచితరీతిన సన్నివేశములును కల్పించి తన్మూలమున నాటకమునకు గౌరవమును కొనిరావలెను. పూర్వాపూర్వ సన్నివేశము ఉత్తరోత్తర సన్నివేశములకు కారణములగును. అప్పుడే నాటకము సహృదయులకు హత్తుకొని మరుపురాకుండా నుండగలదు."[13]

నాటకాన్ని పరిశీలించగా ప్రథమాంకంలో ఆలయ ముఖద్వారం చెంత కూర్చున్న తిరుప్పాణ్, అక్కడ చేరిన లోకసారంగముని, వేదవేద్యుడు, దేవదత్తుడు మధ్య జరిగే సంభాషణవల్ల తిరుప్పాణ్ ఆలయ ప్రవేశానికై పడే బాధ, లోకసారంగముని మత మౌఢ్యం స్పష్టంగా చిత్రీకరించటం ఉంది.

లోకసారంగముని కోపంతో "నీ విక్కడికి ఎందుకు వచ్చితివి? నీవీ ఆలయ ముఖద్వారమునకు ఎదురుగా పద్మాసనము వేసుకొని కూర్చుండి నేలను ఎందుకు అపవిత్రం చేసినావు?' అని కసరుతాడు.[14] తిరుప్పాణ్ వినయంతో 'నా రంగని దర్శించుటకు వచ్చితిని. నన్ను గుడిలోనికి రానిండు. నా స్వామిని కన్నులారా చూచి ఆనందించుటకు అనుమతింపుడు'[15] అంటాడు. ఈ సన్నివేశంలో పాత్రల భిన్న స్వభావాలను వ్యక్తం చేయటం కనిపిస్తుంది.

ద్వితీయాంకంలో తిరుప్పాణ్ మునీశ్వరులు నీరు ముంచిన రేవులో కూర్చొని అంటు కల్గిస్తూ ఉంటాడు. అంటుపడిన రేవులో మునీశ్వరు నీరు ముంచరు. కొత్త రేవు ఏర్పరచుకుంటారు. మునీశ్వరులకు "శారీరక శ్రమ

పరవాలేదు. మానసిక పావిత్ర్యము మలినదూషితమైన ఓర్చలేరు."16 "ఎన్ని రేవులు మార్చుట? ఎంత దూరము నడచుట? ఎక్కడ జల సమార్జనము చేయుట? ఏమి చెప్పిన వినడు కదా! చెప్పి చెప్పి విసిగిపోతిని"17 అంటూ సహనాన్ని కోల్పోయి, "నే నిచ్చటనే అభిషేక జలము తీసుకొనిపోక తప్పదు. ఓరీ కదలవు కదా! నీకిదే శాస్తి"18 అంటూ రాయి విసురుతాడు. ఇక్కడ లోక సారంగముని పాత్ర తీవ్రత కనిపిస్తుంది అంతేకాదు, మొదట చెప్పిన రెండు పాత్రలలో ఒక పాత్ర పైచేయిగా చూపించటం గమనించవచ్చు. మొదటి సన్ని వేశంలో రెండు భిన్న స్వభావాలు, రెండవ సన్నివేశంలో ఒక పాత్ర పైచేయిగా ఉండటం కనిపిస్తుంది.

చతుర్థాంకంలో లోకసారంగముని, శ్రీరంగనాథుల సంభాషణ. ఈ సన్నివేశములో ఇంతకుముందు చెప్పిన పాత్ర మాలిన్యాన్ని తొలగించి, సర్వ మానవ సమానత్వం గుర్తించేట్టుగా చేస్తుంది. అందుకే లోకసారంగముని పంచమాంకంలో "మలిన మనస్కుల భావన మలిన దేహము! నీది పరిశుద్ధ తేజము తిరుప్పాణ్!"19 అంటాడు. ఇక్కడ రెండవ సన్నివేశంలో పైచేయిగా ఉన్న పాత్ర నిజాన్ని గ్రహించి మనస్సు మార్చుకొని అన్న మాటలు. దీనివల్ల నాటక ఫలం సిద్ధించింది.

ఇట్లు పైన పేర్కొన్న మూడు సన్నివేశాలకు ఒకదానికొకటి సంబంధం కూర్చి, నాటక ఫలసిద్ధి కలగడానికి వీలు కల్పించబడింది.

ద్వితీయాంకంలో కావేరీ నదికి సంబంధించిన చర్చలో వేదవేద్యుడు, దేవదత్తుడు ఇరువురు తమ తమ స్వభావాల కనుకూలంగా కావేరీ నదిని గూర్చి మాట్లాడటం ఉంది. వేదవేద్యుడు "పూజా పుణ్యము కొరకెంత తొందరో ఈ పరమ పుణ్య శాలినికి" అని అంటే (నాటకం - పుట. 18) దేవదత్తుడు "అవునీ పవిత్రురాలు శ్రీరంగేశుని పాదాలు తాకుటకే ప్రాకారము మీదకు పడిపడి వచ్చుట. దాని ఉత్సాహమే ఉత్సాహము" (నాటకం-పుట : 18) అని అంటాడు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని వేదవేద్యుడు "నదీమతల్లికే ఇంతటి ఆరాట

మైన, భక్తుని కెంత వేదనో కదా!?" (నాటకం - పుట : 18) అంటాడు. వేద వేద్యుని భావాన్ని తెలుసుకొని దేవదత్తుడు "ఎంత ఆరాటమైనను ప్రాకారము తాకి మరలిపోవుటేకాని దేవాలయములో ప్రవేశించుటలేదు కదా?" (నాటకం - పుట : 18) అని అంటాడు. ఈ మాటలకు స్పందించిన వేదవేద్యుడు "ఆరాట మధికమయిన కావేరి ఊరుకొనునా? వరదై దేవాలయమును ముంచెత్తి తీరును. అదే అభిషేకము." (నాటకం - పుట : 18) అంటూ హెచ్చరిస్తాడు. వీరిరువురి మాటలవల్ల రెండు విరుద్ధ భావాలకు ఉన్న స్పర్థ స్పష్టమైంది.

ఈ విధంగా అనేక సన్నివేశాల్ని కల్పించి నాటక కథాగమనం నిరాఘాటంగా సాగిపోయేట్లు చేశారు.

## పాత్రచిత్రణము :

మునివాహనుడు నాటకంలో ప్రధాన పాత్రలను ఈ క్రింది విధంగా పరిచయం చేయవచ్చును.

## తిరుప్పాణ్ ఆళ్వార్ :

'మునివాహనుడు'లో ప్రధానపాత్ర. "శ్రీ అనునది తమిళమందు 'తిరు'గా మారింది. సంగీత వాద్యాలు వాయించు కులం 'పాణ్' అనేది. తమిళ వ్యవహారాన్ననుసరించి ఇతని పేరు తిరుప్పాణ్ అయింది. ఇతడు జన్మించిన కులంలోని పూర్వులు స్పృశ్యులే తరువాత నట విట గాయకుల సంపర్కం వల్ల, దేవదాసీలతో కలిగిన సంబంధం వల్ల అస్పృశ్యులైనందువల్ల, తిరుప్పాణ్ అస్పృశ్య జాతికి చెందినవాడు"[20] అయినాడు.

తిరుపాణ్ మహా భక్తుడు, గాయకుడు, కవి, ఆత్మాభిమాని, మర్యాద మన్నన కల వ్యక్తి. నేర్పు సహనం ఈతని ప్రత్యేక గుణాలు.

నిరంతరం శ్రీరంగనాథుని గూర్చి గానం చేసి, ధ్యానించి, స్వామి దర్శనానికై ఆరాటపడ్డాడు. లోకసారంగముని ఇతన్ని ద్వేషించినా, రాతితో కొట్టినా, గుడిలోనికి రానీయకుండ ప్రతిఘటించినా, తిరుప్పాణ్ సహనంతో, స్వామి ధ్యానంలోనే మునిగి, బాహ్య ప్రపంచాన్నే మరిచాడు. ఇతని భక్తికి మెచ్చి

శ్రీరంగనాథుడే స్వయంగా లోకసారంగమునితో చెప్పి, ఒప్పించి, ఆజ్ఞాపించి, తిరుప్పాణ్‌ను భుజాలమీద గుడిలోనికి మోసుకొని తెచ్చి, తన దర్శనం చేయించ మని కోరుతాడు. తిరుప్పాణ్ ఆలయ ప్రవేశం చేయాలనుకోవటం ఒక పెద్ద సాంఘికమైన మార్పు.

## లోకసారంగముని :

ఇతడు శ్రీరంగంలోని శ్రీరంగనాథ దేవాలయ ధర్మకర్త, పూజారి, గొప్ప భక్తుడు. కులాచార, సంప్రదాయాలను అనుసరించినవాడే తప్ప ప్రతి నాయకుడు కాడు. తిరుప్పాణ్ అస్పృశ్యుడు. అస్పృశ్యునికి ఆలయ ప్రవేశం లేదు. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. అందుకే తిరుప్పాణ్‌కు ఆలయ ప్రవేశం లేదంటాడు. సమాజంలో ఆచార సంప్రదాయాల విషయమైన మార్పును ప్రతిఘ టిస్తాడు. శ్రీరంగనాథుని ఆజ్ఞను అనుసరించి తిరుప్పాణ్‌ను భుజాలపై నెక్కించు కొని గుడి లోపల స్వామి దర్శనం చేయిస్తాడు. సంప్రదాయపరాయణుడైన ఈతనిలో పరివర్తనం వస్తుంది. ఇది సామాజిక పరిణామంలో ఒక మలుపు.

## శ్రీరంగనాథుడు :

శ్రీ మహావిష్ణువు, తమిళ దేశంలోని కావేరీ తీరంలోని శ్రీరంగ పట్టణంలో వెలసిన స్వామి. తిరుప్పాణ్ భక్తికి మెచ్చి, లోకసారంగమునికి నచ్చజెప్పి, ఆజ్ఞాపించి, తిరుప్పాణ్‌కు ఆలయ ప్రవేశం చేయిస్తాడు. కథాగతికి ఈ పాత్ర ఎంతగానో తోడ్పడుతుంది.

## వేదవేద్యుడు :

ఇది కల్పిత పాత్ర. తిరుప్పాణ్ భక్తి మహిమను వ్యాఖ్యానించటానికి ఈ పాత్ర తోడ్పడుతుంది. కుల భేదాల్ని లెక్కచేయక, అస్పృశ్యతను పాటించక, తిరుప్పాణ్ గాయానికి కట్టుకట్టి, ఓదార్చి, అతని ధన్యతను కీర్తించినవాడు వేదవేద్యుడు. ప్రతి విషయాన్ని మారుతున్న సంఘంతోపాటు, మారుతున్న వ్యక్తి విలువలను అంచనా వేసి - ఆధునిక తత్వానికి, మూఢాచార విఘ్నతకు పాటుపడే వ్యక్తులకు ప్రతీకగా నాటకంలో చైతన్యవంతమైన ఈ పాత్ర కనిపిస్తుంది.

## దేవదత్తుడు :

ఇదీ కల్పిత పాత్రే. ఇతడు వేదవేద్యుని స్నేహితుడు, లోకసారంగముని శిష్యుడు, కులాచార సంప్రదాయాభిమాని, అస్పృశ్యతను పాటించువాడు. వేద వేద్యునితో మాటిమాటికి విభేదించి లోకసారంగమునిని అనుసరించిన పాత్ర దేవదత్తుడు. చివరకు తిరుప్పాణ్ భక్తిని గ్రహించి నమస్కరిస్తాడు.

ఈ విధంగా కల్పిత పాత్రలైన వేదవేద్యుడు, దేవదత్తుడు నాయకుడైన తిరుప్పాణ్ గుణగణాలనుగాని, లోకసారంగముని గొప్పతనాన్నిగాని వ్యాఖ్యానించే ప్రయోజనాన్ని సాధించాయి. అంతేకాక, ప్రవేశక విష్కంభాల ప్రయోజనాన్నికూడ ఈ రెండు పాత్రలు సాధించటం చూడవచ్చు.

## మునివాహనుడు - నాటకలక్షణం

రచయిత ఆధునిక కాలానికి సంబంధించినవాడు కావటంవల్ల నాటకంలో ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాల్ని పరికించవలసి ఉంది.

పంచ సంధులు, పంచావస్థలు, అర్థ ప్రకృతుల, ప్రాచ్య నాటక రీతి కానీ, ప్రారంభోచ్ఛ్రిత్యుపహారాల పాశ్చాత్య నాటక విధానం కానీ ప్రధానంగా వస్తువు ప్రారంభం, రసోన్మీలనోన్ముఖత్వం, ఫలాగమోపసంహారం వంటి సంబంధ సుందరం కావటం వివరించబడిందా అన్నది ప్రధానాంశం ఈ దృష్టితో పరికించి, ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణ విలసితంగా పొందిన వికాసం విశదం చేయవలసి ఉంది.

## లక్షణ పరిశీలనం :

ఈ నాటకంలో ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయాల మేలి గుణాలు పుణికి పుచ్చుకొని, ప్రాచ్య రీతికి సమీపస్థంగా 'మునివాహనుడు' నాటక సృష్టి జరిగింది. అవసరమైన సందర్భాలలో సంప్రదాయం మీద ప్రయోగం జరిగింది. ఈ విష యాన్ని నాటకంలో మనం చూడవచ్చు.

ఇది సలక్షణ పరిప్రదాయి. ఏ నాటకంలో కూడ అన్ని నాటక లక్షణాలు వర్తించక పోవచ్చు. ప్రవర్తించే లక్షణాలన్నీ ఈ నాటకంలో సంప్రదాయబద్ధంగా కనిపిస్తాయి. నాటక రచనలో ప్రాచ్య పాశ్చాత్య లక్షణాల సమ్మేళనం ఉంది. దృశ్య శ్రవ్య నాటక రీతుల సమన్వయం ఉంది. ప్రయోగం, పఠనం-రెండింటి పరిధీ సమన్వయం ఉంది. పై విషయాల పరిశీలనం వివరణంగా ఉంది.

## సంస్కృతనాటకసంప్రదాయం - పరిశీలన

నాటక లక్షణాలతో నాటక నిర్మాణం దృష్టితో ప్రధానంగా కనిపించే లక్షణాలు పంచ సంధులు, పంచావస్థలు, అర్థ ప్రకృతులు. అవస్థలు ఐదూ, అర్థప్రకృతులు ఐదూ కలిసి పంచసంధులుగా నాటక పాటిష్ఠ్య దృష్టితోనే కాదు, సమన్వయ సంబంధం దృష్టితోకూడ ప్రధానమే.

### పంచసంధులు :

1. ముఖసంధి 2. ప్రతిముఖసంధి 3. గర్భసంధి 4. అవమర్శసంధి 5. నిర్వహణసంధి అనేవి పంచసంధులు.

పంచసంధులను పరిశీలించేటప్పుడు మొట్టమొదట మనం సంధి అంటే ఏమిటో చూడాలి. "ఒక ప్రయోజనముతో కూడిన కథాంశములకు అవాంతర ప్రయోజనంతోడి సంబంధము సంధి యనబడును. ఇట ప్రయోజన శబ్దముచే ధర్మార్థకామములనెడి త్రివర్గ రూపమగు ఫలము వివక్షితము. కాగా, ధర్మార్థ కామములలో ముఖ్యముగా కొన్ని ఏ యొక్కదానితో సంబంధించిన కథాంశ ములకైనను తద్వ్యతిరిక్తములును, అప్రధానములునగు తక్కిన రెండింటితోడి సంబంధమే సంధియని ఫలితార్థము."21

"ఆరంభ బీజ సంబంధమున ముఖసంధి, ప్రయత్నబిందు సంబంధమున ప్రతిముఖసంధి, ప్రాప్త్యాశా పతాక సంబంధమున గర్భసంధి, నియతాప్తి ప్రక రుల సంబంధమున అవమర్శసంధి. ఫలాగమ కార్యాల సంబంధమున నిర్వహణ సంధి అనేవి రీతిగ ఏర్పడుతాయి."22

## పంచావస్థలు :

ఇవి 1. ఆరంభం 2. ప్రయత్నం 3. ప్రాప్త్యాశ 4. నియతాప్తి 5. ఫలాగమం అనేవి. పంచావస్థల లక్షణాలలో కథానాయకుడు పూనుకొని నిర్వహించే కథాంశం ఆరంభమై తదనుకూల ప్రయత్నం జరిగి వాంఛార్థ సిద్ధికి అనుకూల ప్రయాణంలో ప్రాప్త్యాశ సంభవించి, విధి విహితమైన నియతమైన స్థితి ఏర్పడి ఉచితమైన సహజమైన, సమంజసమైన ఫలం లభించటంతో పంచావస్థల పరిణామం సంపూర్ణం అవుతుంది.

## అర్థప్రకృతులు :

ఇవి 1 బీజం 2. బిందువు 3. పతాక 4. ప్రకరి 5. కార్యం అనేవి. వీని లక్షణాలు ఈ విధంగా ఉన్నాయి: ఇవి కథాసూత్ర ప్రణాళికకు సంబంధించినవి. బీజంలో కథ యొక్క ప్రాథమిక అంశం ఉంటుంది. బిందువులో కథయొక్క కించిత్ పరిణత దశ ఉంటుంది. పతాకలో అత్యంత ఉత్కృష్ట దశ ఆవిర్భవిస్తుంది. ప్రకరిలో కథా నిర్మాణంలోని సంధి బంధాల సడలింపు మొదలవుతుంది. కార్యంలో కథాపరిణామంలోని సంపూర్ణ ఫలం సిద్ధిస్తుంది.

## పంచసంధుల గమనం

పంచావస్థలు, అర్థప్రకృతులు కలిసి పంచసంధులు ఏర్పడతాయి. నాయక పరమైన ఆరంభం కథాపరమైన బిందువు కలిస్తే ముఖసంధి ఏర్పడుతుంది. నాయకుడి ప్రాప్త్యాశ కథాసూత్రంలోని పతాక అవుతుంది. అనుసంధానం పొందితే గర్భసంధిగా మారుతుంది. నాయక పాత్ర గ్రహించే నియతాప్తి కథాసూత్రంలోని ప్రకరి చేరువైతే అవమర్శసంధి అవుతుంది. నాయక కృషి ఫలితంగా సంక్రమించే ఫలం కథా సూత్రంలోని కార్యం సమన్వయం పొందితే ఏర్పడేది నిర్వహణ సంధి. ఈ సంధి బంధం సక్రమంగా పరిపూర్ణత్వం సంతరించుకొంటే ఆ నాటకం పంచ సంధులతో విలసిల్లుతూ ఉంటుందని భావింపవచ్చు.

## పంచసంధులు - 'మునివాహనుడు'

'మునివాహనుడు' నాటకంలో పంచ సంధులు నిర్వహింపబడిన తీరును పరిశీలించవలసి ఉంది. ఈ నాటకంలో హరిజనుడైన తిరుప్పాణ్ ఆళ్వా

ప్రవేశం కథలో ప్రధానాంశం. ఈ ప్రధానాంశం 'మునివాహనుడు' నాటకంలో ఇతివృత్తంగా రూపుదిద్దుకొంది. ఈ దృష్టితో నాటక కథ అయిదు ప్రధాన భాగాలుగా విభజించటానికి వీలుంది.

## ముఖ సంధి :

నాయకుడి ప్రయత్నం ఆరంభంగా కథాసూత్రం బీజంగా కలిసి ఏకం కావటంతో ముఖ సంధి ఏర్పడుతుంది.

వేదవేద్యుడు తిరుప్పాణ్ భక్తిపారవశ్యాన్ని మెచ్చుకుంటూ 'తిరుప్పాణ్ భక్తి పారవశ్యం పరమోత్కృష్టం' అంటే, దేవదత్తుడు 'పంచముడు మహా భక్తుడా? మహా గాయకుడా? అశుభం' అంటాడు. వేదవేద్యుడు ఎన్ని విధాలుగా చెప్పినా లోకసారంగముని, దేవదత్తులు వెటకారంగా మాట్లాడుతారు.

కథాసూత్ర బీజం ఈ విధంగా రూపొందింది. ఇందులో హరిజనుడి ఆలయ ప్రవేశం ఎంతవరకు సమంజసం అనే ప్రశ్న కథా నిర్మాణంలో గోచరం అవుతూ ఉంది. హరిజనుడి ఆలయ ప్రవేశం వీలుపడదని చెప్పటంతో ముఖ సంధి ఏర్పడింది.

## ప్రతిముఖ సంధి :

నాయకుడి ప్రయత్నం తోడుగా కథాసూత్రంలోని బిందువు రూపొందగా ఏర్పడుతుంది ప్రతిముఖ సంధి.

నాయకుడైన తిరుప్పాణ్ లోకసారంగముని అడుగిడినచోటనే ధ్యానం చేస్తూ కూర్చుంటాడు. దీంతో నాయకుని ప్రయత్నం ఆరంభం అవుతుంది. ఇది సహించని లోకసారంగ ముని తిరుప్పాణ్‌ను రాతితో కొడతాడు ఇక్కడ కథా సూత్రంలోని బిందులక్షణం వ్యక్తం అవుతుంది.

## గర్భ సంధి :

నాయకుడి ప్రాప్త్యాశకు కథాసూత్ర పతాకకు అనుసంధానం పొంది ఆవిష్కృతమవుతుంది గర్భసంధి.

నాయకుడైన తిరుప్పాణ్ విషయాన్ని ప్రస్తావిస్తూ వేదవేద్యుడు 'ఇంత వరకు మునీంద్రుల నిశ్వాసం తిరుప్పాణ్‌కు ఉచ్ఛ్వాసం. ఇక తిరుప్పాణ్ నిశ్వాసం లోకసారంగ మునికి ఉచ్ఛ్వాసం' (పుట : 32) అంటాడు. రాతితో కొట్టి తిరుప్పాణ్‌ను వెళ్ళగొట్టిన నాటినుండి లోకసారంగముని శ్రీరంగనాథుని వెతుకుతున్న తిరుప్పాణ్‌ని వెతుకుతున్నాడు.

వేదవేద్యుడు లోకసారంగమునితో, 'మీరు పంచముని తాకి మైల పడినారు. శ్రీరంగనాథ ఆలయంలోకి ప్రవేశింపరా'దని అంటాడు. దీనితో అతనిలో కొంత చలనం కలుగుతుంది. ఆలయ ప్రవేశం నిషిద్ధమనగానే అది ఎంత దారుణంగా ఉంటుందోనని భావించటానికి మార్గం ఏర్పరుస్తూ ఉండటం ప్రధానాంశంగా పరిణామం చెందుతూ ఉండటంవల్ల గర్భ సంధి ఏర్పడింది.

## అవమర్శ సంధి :

నాయకుడి నియతాప్తికి కథాసూత్రంలోని ప్రకరికి ఏర్పడ్డ కలయిక నుంచి అవమర్శ సంధి రూపొందింది.

'మునివాహనుడు' నాటకంలో తిరుప్పాణి ఆలయప్రవేశానికి అవరోధంగా ఉన్న లోకసారంగముని, శ్రీరంగనాథుని తిరస్కారం భరించలేక ఆవేదనకు లోనై, తిరుప్పాణ్‌ను ఆలయ ప్రవేశం చేయించటానికి సమ్మతించటంతో అవమర్శ సంధి అవగతమవుతూ ఉంది.

## నిర్వహణ సంధి:

కథానాయకుడి ఆరంభ ప్రయత్న ప్రాప్త్యాశలు ఎలాంటి ఫలం పొందబోతాయో తెలిపే ఫలాగమం కథాసూత్రంలోని కార్యం సమ్మేళనం కాగా నిర్వహణసంధి ఏర్పడుతుంది.

'మునివాహనుడు' నాటకంలో లోకసారంగముని అనుకున్న తీరు మారిపోయి, తిరస్కరించిన విధానం చేరువై, కథాప్రణాళిక పరాకాష్ఠకు చేరుకొన్నప్పుడు తరతరాలుగా ఆలయప్రవేశాన్ని ఆశించిన తిరుప్పాణ్ ఆలయంలో ప్రవేశించటాన్ని అంగీకరింపజేయటంతో నిర్వహణసంధి ముగిసిపోతుంది.

ఈ రీతిగా పంచావస్థలు, అర్థప్రకృతులు అనుసంధానం పొందుతూ ఉన్నాయి. కాబట్టి, ఈ నాటకం సంస్కృత నాటక నిర్మాణ లక్షణాలతో విలసిల్లుతూ ఉంది.

## నాంద్యాదులు

సంస్కృత నాటకాలని మనం పరిశీలించినప్పుడు స్థూలంగా నాటక ప్రారంభంలో నాంది, ప్రస్తావన; నాటక మధ్యంలో ప్రవేశిక, విష్కంభకాలు; నాటకాంతంలో భరతవాక్యం ఉంటాయి.

### నాంది:

నాటకంలో ప్రారంభంలో ప్రథమ సూత్రధారుడు తెరలో—

"శ్రీయుతుడు శాంతచిత్తుడు శిష్టరక్ష
కుండు దుష్ట శిక్షణ ధర్మ మండితుండు
లోకసారంగముని వాహనాకరుండు
విష్ణుదేవుండు మిమ్ము దీవించుగాక!"[23]

అని పఠిస్తాడు. పై పద్యంలో ఆశీర్వాదం, నమస్కారం, కావ్యార్థసూచనం, పదనియమం మొదలుగాగల సాంప్రదాయకమైన లక్షణాలన్నీ చక్కగా అమరినాయి.

### ప్రస్తావన :

ద్వితీయ సూత్రధారుడు ప్రవేశించి నటిని పిలిచి, వసంతఋతు శోభను గానం చేయమంటాడు. సూత్రధారుడు హరిజనుడగు తిరుప్పాణ్ కవితామాధుర్యంతో సంగీతాన్ని భూమి కద్దినట్లు, మామిడి చిగుళ్ళు మెక్కి గొంతు వగరెక్కి కోకిల పాడిందంటాడు.[24] ఈ విధంగా ప్రథమాంకంలో ప్రవేశింపబోయే పాత్రసూచనం చేస్తాడు. ఈ ప్రస్తావన సాంప్రదాయకమైందిగా కనిపిస్తుంది.

## ప్రవేశిక విష్కంభకాలు :

నాటకంలో ప్రత్యేకంగా ప్రవేశిక విష్కంభాలు పేర్కొబడలేదు. కాని, ఇందులో కల్పితాలైన వేదవేద్యుడు, దేవదత్తుడు పాత్రల ద్వారా ప్రవేశిక విష్కంభకాల ప్రయోజనం సాధించబడింది అని చెప్పవచ్చు. ఇక్కడ సంప్రదాయంమీద ప్రయోగం జరిగినట్లు కనిపిస్తుంది. రచయిత చెప్పినట్లు "అవసరమైన సందర్భాలలో సంప్రదాయంమీద ప్రయోగమూ జరిగింది"25 అని తెలుస్తుంది.

## భరతవాక్యం :

నాటకం చివరలో లోకసారంగముని లోక కల్యాణార్థమై పలకటం ఈ క్రింది పద్యంలో కనిపిస్తుంది:

''ఈ తిరుప్పాణ్ ప్రకాశమే యిలకు మిగుల
పిలచి శ్రీరంగనాథుండు వెలుగునట్లు
సర్వ సామాన్య మానవశక్తి పొంది
ప్రజల ప్రతినిధుల్ జనుల కాపాడుగాక!''26

అని భరతవాక్యం చెప్పబడింది.

## అంకం :

నాటకాన్ని అంకాలుగా విభజించటం ఉంది. ''ఈ విభజన పఠన విరామమునేగాక కథావిశ్రాంతిని కూడ అపేక్షించియే చేయబడును.''27

''ఏకైక దిన సంవృత్తమ్ ఏకనేతృ ప్రయోజనం
బహుపాత్ర ప్రవేశార్హమ్ అంకమాసన్న నాయకమ్.''

''లోకమున జరిగిన వృత్తాంతములో ఒకనాటి సంఘటనమునే అంకమునందు నిబంధింపవలెను. కథ ఎంత దీర్ఘకాల ప్రవృత్తమైనను కానవచ్చును. కాని, ఒక్కొక్క అంకము ఆ దీర్ఘకాలములో ఒక్కొక్క దినములో జరిగినదానిని మాత్రమే స్వీకరింపవలెను''28

మునివాహనుడు నాటకంలో అంకాలు కథను అనుసరించి ఏర్పడ్డాయి. అంకాలలో అవసరమైన రంగాలు సిద్ధించాయి ప్రతి రంగం కనీసం ఒక సన్ని వేశంతో ఉంటుంది. ఇటువంటి సన్నివేశాల కలయిక ఒక అంకంగా రూపుదిద్దు కొంది. ఇట్టి అంకాలు ఐదు మునివాహనుడు నాటకంలో ఉన్నాయి.

నాటకంలోని అంకాలలో కనిపించే విశేషం ఏమిటంటే- పాటలు ఉండటం. పాటలెందుకున్నాయని చూస్తే తిరుప్పాణ్ భక్తిగీతి మాధుర్యం సంతరించుకొన్న పాత్ర. తిరుప్పాణ్ పాట పాడటమే భక్తిమార్గంగా కలవాడు అందుకోసం పాటలు వ్రాయటం అవసరమైనట్లు కనిపిస్తుంది.

అంకాలను సరిగ్గా గుర్తిస్తే ప్రతి అంకం పాటతోనో, పద్యంతోనో ముగియటం కానీ, ప్రారంభం కావటం కానీ, రెండూ కానీ కనిపిస్తాయి. ఇక్కడ ప్రయోగ దృష్టి ఉంది. తెరపడినా- పాటో, పద్యమో వినబడుతూ ఉంటుంది. మళ్ళీ తెర తీసేవరకు ఈ పాట వినబడుతూ, విరామం వల్ల రాబోయే విసుగును తొలగించే ప్రయత్నం ఉంది. నాటక రచయిత నటుడు, దర్శకుడు కావటం వల్ల నాటక రచనంలోనే ప్రయోగంలో ఎదురయ్యే సమస్య లను పరిహరించే ప్రయత్నం చేశాడని చెప్పవచ్చు.

## పాశ్చాత్య నాటకలక్షణాలు

లలిత కళల్లో సాహిత్యం అనేది ఆనందదాయకమని పేర్కొబడింది. సాహిత్య రూపాలలో నాటకం రమ్యమైన రూపం. భారతీయ పాశ్చాత్య నాటక లక్షణ కర్తలు వివిధ లక్షణాలను బట్టి నాటకాన్ని ఉత్తమమైన సాహిత్య కళా రూపంగా పేర్కొన్నారు.

ఇంగ్లీషు నాటకాలలో భారతీయ నాటకాలలో కంటె కొన్ని ప్రత్యేక లక్షణాలు కనిపిస్తాయి. అవి :

1. నాటకంలో పూర్వరంగం (ప్రోలోగ్) అనేది కొత్తగా కనిపిస్తుంది.
2. కోరస్ (బృందగానం) అనేది ఆధునికంగా కనిపిస్తుంది.

3. రంగం అనేది, దానిలో విభాగాలు (సీనులు) అనేవి ప్రఖ్యాత నాటకాలలో కనిపిస్తాయి.
4. నాటకాంతం (చరమాంకం) అనేది మనోవైజ్ఞానిక సిద్ధాంత రీతిలో కనిస్తుంది.
5. నాటకంలో ఉత్తర రంగం (ఎపిలోగ్) అనేది నూతనంగా కనిపిస్తుంది.
6. నాటక ఇతివృత్తం ఆదర్శం, ప్రయోజనం అనే దృక్పథాలతో కనిపిస్తుంది.
7. విషాదాంత లక్షణాలు ఉన్న కొన్ని ప్రసిద్ధ నాటకాలు కనిపిస్తాయి.
8. వీటిలో ప్రాఫెట్స్, ఆరకిల్స్ మొదలైన ప్రత్యేక పాత్రలు కనిపిస్తాయి.
9. మోదాంత, విషాదమోదాంత లక్షణాలు కలిగిన నాటకాలు కొన్ని కనిపిస్తాయి.
10. ఐక్యత్రయం అనేది వీటిలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇవి కథైక్యం, కాలైక్యం, దేశైక్యం అనేవి ఐక్యత్రయంగా పేర్కొబడ్డాయి. ఇలాగ అన్ని లక్షణాలు నాటకాలలో గోచరమౌతాయి.[29]

సాంఘిక నాటకాలలో సమాజంలోని స్థితిగతులను బట్టి నాటకాలలో కొన్ని భేదాలు కనిపిస్తాయి. ఇది జాతిజనుల జీవన విధానాన్ని, సంస్కృతిని తెలియజేస్తుంది.

1. కవితానాటకం - పద్యగేయంగా ఆరంభమై తిరిగి కొనసాగుతుంది.
2. చారిత్రక నాటకం చరిత్ర పట్ల ప్రజలకుండే అభిమానాన్ని తెలియజేస్తుంది. ఇవి ఇంగ్లీషు నాటకాలలో ఎక్కువగా కనిపిస్తాయి.
3. శ్రవ్యనాటకం - వినటానికి, చదువుకోటానికి అనుకూలమైన రీతిలో ఉంటాయి.
4. హాస్యనాటకం - హాస్య పాత్రలతో సామాజికులకు ఆనందాన్ని కలిగించే కొన్ని నాటకాలు కనిపిస్తాయి.

5. సాంఘికనాటకం - ఆధునిక సమాజంలో వ్యక్తులలో గోచరించే అనేక అంశాలతో కూడిన సాంఘిక నాటకాలు ప్రసిద్ధి పొందాయి.

6. అపరాధ పరిశోధక నాటకం - డిటెక్టివ్ సాహిత్యం లాగానే ఇవి కూడ అపరాధ పరిశోధన, నిజాన్ని బయటకు లాగటం మొదలగు అంశాలతో వెలువడ్డాయి.

7. అనువాదనాటకం - ఇతర భాషలలోంచి ఇంగ్లీషు భాషలోకి ప్రసిద్ధమైన నాటకాలు అనువాదరూపంలో వెలువడ్డాయి.

8. ప్రచారనాటకం - దేశం అవసరాలను గుర్తించి వాటికి అనుగుణంగా నాటకాలు వెలువడ్డాయి.

9. రాజకీయ నాటకం - రాజకీయ ప్రక్షాళన సిద్ధాంతాల్ని వ్యాప్తి చేయటం కోసం రూపొందిన నాటకాలు.

10. బాలనాటకం - బాలబాలికల పాత్రల కోసం, ప్రదర్శించుకోవటం కోసం వెలువడ్డాయి.

11. స్త్రీ నాటకం - స్త్రీ పాత్ర ప్రాధాన్యాన్ని సమస్యల్ని నివారణల్ని తెలిపేవి.

12. నృత్య నాటకం-సంగీత నృత్యభరితంగా రూపొందాయి.

13. వర్గపోరాటనాటకం - పీడకులకు పీడితులకు సంఘర్షణ అనేది తప్పనిసరి పరిణామంగా కనిపిస్తుంది. ఇటువంటివి వ్యక్తంచేసేవే ఈ నాటకాలు.

14. సాంసారిక నాటకం - దాంపత్యంలోని తీపి జ్ఞాపకాల్ని, చిన్న చిన్న కలహాల్ని, వివాహ స్వరూప స్వభావాల్ని, స్త్రీ పురుష సంబంధాల్ని, సంఘంలో జరిగే అన్యాయాల్ని చిత్రించేవి.

ఈ విధంగా పాశ్చాత్య సాహిత్యంలో అనేక రీతులుగా నాటకం అనేది కనిపిస్తుంది 30

# మునివాహనుడు నాటకం - లక్షణసమన్వయం

## పూర్వరంగం :

ఈ నాటకంలో పూర్వరంగం అనేది నూతనంగా కనిపిస్తుంది. మునివాహనుని ప్రవేశం, వేదవేద్యుడు, దేవదత్తుడు, లోకసారంగముని సంభాషణలు, కావేరీతీరం, తిరుప్పాణ్‌ని లోకసారంగముని రాయి విసరికొట్టటం, తిరుప్పాణ్ తలకు దెబ్బ తగలి రక్తం స్రవించటం, తిరుప్పాణ్ గాన మాధుర్యం, భక్తి తత్పరత, శ్రీరంగనాథ దేవాలయం వర్ణన, లోకసారంగముని ఆవేదన మొదలైనవి కనిపిస్తాయి.

నాటకంలో మొదటి మూడు అంకాలలోని కథాభాగం పూర్వరంగ చిత్రణంలో కనిపిస్తుంది. ఇది తిరుప్పాణ్ గాన మాధుర్యాన్ని, భక్తి పీరాన్ని, ఆలయ ప్రవేశానికి - దైవ దర్శనానికి పొందే తరతరాలనాటి ఆవేదనని వ్యక్తం చేస్తుంది. మత మౌఢ్యానికి, మానవత్వానికి మధ్య సంఘర్షణ ఈ రంగంలో ఆయా దశలలో కనిపిస్తుంది

## ఉత్తరరంగం :

మునివాహనుడు నాటకాంతంలో ఉత్తరరంగం నూతన దృక్పథంతో కనిపిస్తుంది. చతుర్థాంకం, పంచమాంకం చివరివరకు ఉండే కథ ఈ భాగంలో వ్యక్తం అవుతుంది. తిరుప్పాణ్ ఆలయానికి ముందు,ముఖద్వారం దగ్గర పాటను-

''శ్రీరంగనాథా శ్రీరంగధామా
ననుగన్న తండ్రి నా కన్నతండ్రి
నా కొరకు నీవు నీ కొరకు నేను
చీకటిని ఆకలిని పోకార్చినాము''31

అనే తీరులో మైమరచి పాడటం కనిపిస్తుంది. తిరుప్పాణ్ ధ్యానైకదీక్ష, లోకసారంగముని శయనమందిరంలో ధ్యానం, శ్రీరంగనాథునివలన తిరుప్పాణ్ పరమ భక్తుడనేది వెల్లడి కావటం, మానవునకు మాధవునకు మధ్య మలినము

లేదు అనే సామాజిక, మత సూక్తాన్ని వివరించటం, భక్తి స్థిరమే - దేవుడే చంచలుడు అని వ్యక్తం చేయటం మొదలైనవి కనిపిస్తాయి.

తిరుప్పాణ్ జన్మ రహస్యాన్ని చెబుతూ - జన్మవల్లకాదు, కర్మవల్ల పవిత్రాపవిత్రతలు ప్రవర్తిల్లటం, తిరుప్పాణ్ పవిత్రుడు అని శ్రీరంగనాథుడే వెలిబుచ్చటం, మొదలైనవి కనిపిస్తాయి. పంచమాంకంలో కావేరీ తీర వర్ణన, శ్రీరంగనాథ దేవాలయం వర్ణన కనిపిస్తాయి. చివరకు తిరుప్పాణ్‌ను కీర్తిస్తూ లోకసారంగముని—

"ధన్యజీవీ తిరుప్పాణాళ్వార్
దైవజీవీ తిరుప్పాణాళ్వార్
ధర్మజీవీ తిరుప్పాణాళ్వార్"[32]

అని కీర్తించటం కనిపిస్తుంది. ఈ విధంగా ఉత్తర రంగంలో తిరుప్పాణ్ భక్తి ప్రపత్తులు, లోకసారంగ ముని తిరుప్పాణ్‌కు ఆలయప్రవేశం కల్పించటం, మానవతా దృక్పథం, కావేటికి - కావేటిరంగనికి మలినం లేదనటం మొదలైనవి సర్వమానవతాదృక్పథంతో వెల్లడించటం కనిపిస్తుంది.

## పాటలు :

ఇంగ్లీషు నాటకాలలో కొన్ని సీనులలో కథావైశిష్ట్యంకోసం పాటలు ప్రవేశపెట్టటం కనిపిస్తుంది. మునివాహనుడు నాటకంలో పాటలు రాయటంలో ఒక ధర్మం, వైష్ణవ గీతి మాధుర్యం ఉంది. వీటిలో వైష్ణవ భక్తితత్వం, అష్టవిధ భక్తి వర్ణనం, కీర్తన గుణం కనిపిస్తుంది. ఇవి నాటకాన్ని, కథని రక్తి కట్టించాయి.

తిరుప్పాణ్ భక్తిగీతి మాధుర్యం సంతరించుకొంది. తిరుప్పాణ్ పాట పాడటమే భక్తిమార్గంగా కలవాడు. అందుకోసం ఈ నాటకంలో పాటలు రాయటం అవసరమైంది. అంకం చివరలో, అంకం ప్రారంభంలో కొన్ని సందర్భాలలో, విరామసందర్భంగా విసుగులేకుండా చేయటం, ప్రయోగదృష్ట్యా ఇవి ప్రవేశపెట్టినట్లుగా కనిపిస్తుంది. ప్రథమాంకం చివరలో (తెరలో)—

"గలగల గలగల జలములు జలములు
బుడబుడ బుడబుడ ఘటములు ఘటములు"33

ఈ విధంగా పాట కనిపిస్తుంది.

ద్వితీయాంకం ప్రారంభంలో తిరుప్పాణ్—

"నీవు నాకు దేవుడవని
నీకు నేను భక్తుడనని
నీకు తెలియు నాకు తెలియు
లోకమునకు నేమి తెలియు?"34

ఈ విధముగా గానం ఆత్మ ఆర్తిలో సాగుతుంది.

రెండవ అంకం చివరలో తిరుప్పాణ్—

"రాయి తగిలెను రక్త మొలికెను
ఏమి అయినది ఇంతలో?"35

అని రమ్యగీతిక పాడటం కనిపిస్తుంది. తృతీయాంకం మొదట్లో తిరుప్పాణ్—

"శ్రీరంగ రంగ రంగా - నా యన్న
కావేటి రంగ రంగ
కస్తూరి రంగ రంగా - నా యన్న
కావేటి రంగ రంగా!"36

ఈ విధంగా గాన మాధుర్యంలో తన్మయత్వం చెందటం కనిపిస్తుంది. ఇదే అంకం చివరలో—

"ఇది మాధవుడేలిన భూమి
నర మానవుడంటని భూమి"37

అని కీర్తించటం కనిపిస్తుంది. పంచమాంకం ఆరంభంలో తిరుప్పాణ్—

"దేవా ననుకావ దిగిరావ
దివినుండి భువిపైకి ననుచేర దిగిరావ"38

అని భక్తావేశంతో పాడుకోవటం కనిపిస్తుంది. ఈ విధంగా మునివాహనుడు నాటకంలో పాటలు ప్రదర్శనకు అనుకూలంగానే రచింపబడటం చూడవచ్చు. ఇది రచయిత ప్రయోగదృష్టిని తెలియజేస్తుంది.

## రంగ విభజన :

ఐదు అంకాల మునివాహనుడు నాటకాన్ని మధ్యలో ప్రయోగదృష్ట్యా రంగాలుగా విభజించటం కనిపిస్తుంది. తృతీయాంకలో కావేరి తీరం - ప్రథమ రంగమనేది, తృతీయాంకం ద్వితీయరంగం - శ్రీరంగనాథ దేవాలయం అనేవి స్థలైక్యాన్ని వ్యక్తం చేశాయి. అలాగే చతుర్థాంకంలో ప్రథమరంగం - శ్రీరంగ నాథ దేవాలయ ముఖద్వారం ప్రస్తావన, చతుర్థాంకంలో ద్వితీయరంగం - లోక సారంగముని శయనమందిరం; శ్రీరంగనాథస్వామి, లోకసారంగముని, సంభా షణలలో దేవుడు, గుడి, భక్తి విషయాలు చాల నిశితంగా వెల్లడవుతున్నాయి. ఇదే నాటకంలో ప్రధానమైన భాగంగా రచయిత పేర్కొన్నారు.39 దీనికే బహుమతి ప్రదానం విలువ చేకూరింది.

పంచమాంకం, ప్రథమరంగంలో కావేరీతీరం విషయం, పంచమాంకం ద్వితీయరంగంలో శ్రీరంగనాథ దేవాలయం, లోకసారంగముని భుజాలమీద తిరుప్పాణ్‌తో ప్రవేశించటం, తిరుప్పాణ్ శ్రీరంగనాథునిలో ఐక్యమొందటం మొదలైనవి కనిపిస్తాయి. భగవంతునిలో భక్తుడు భక్తితో ఐక్యమొందినందువల్ల ఇది మోదాంతమే అయింది. ఈ విధంగా పాశ్చాత్య నాటకాలలో కనిపించే

రంగ విభజన కూడ, సాంప్రదాయక నాటక నిర్మాణంలో అంక నిర్మాణం సందర్భంలో ప్రయోగదృష్ట్యా ప్రవేశపెట్టినందువల్ల, నాటక రచయిత నిర్మాణ కౌశలం వ్యక్తమవుతుంది.

## మనో వైజ్ఞానిక విషయాలు

ఈ నాటకంలో చతుర్థాంకంలో మనోవైజ్ఞానిక విషయాలు సామాజిక నేపథ్యంలో తీరుతీరులుగా వ్యక్తమవుతాయి. మతం, దైవం, గుడి, వైష్ణవభక్తి- ఇవి పంచములకు నిషిద్ధాలు అనే మూఢ సంప్రదాయాన్ని భేదిస్తూ శ్రీరంగ నాథుని ద్వారా వ్యక్తం చేయటం దీంట్లో కనిపిస్తుంది. ఇందులోనే కెథారిసిస్ అనే రస నిర్మాణశిల్పం కూడా కన్పిస్తుంది. హరిజనుడు దేవాలయంలో ప్రవేశించటానికి వీలు కల్పించటం ఈ అంకంలో కనిపిస్తుంది. మానవతా వాదం శ్రీరంగనాథునిలోనూ, తిరుప్పాణ్‌లోనూ గోచరిస్తుంది. భక్తి మానవ సమానత్వం, తన్మూలంగా సర్వమానవ సమానత్వం నాటకంలో ప్రతి పాదించడం చూడవచ్చు. అలాగే లోకసారంగముని పశ్చాత్తప్తుడు కావటం, తిరుప్పాణ్ దేవాలయ ప్రవేశం మనోవైజ్ఞానిక సిద్ధాంతరీతిలోనే కనిపిస్తాయి.

## నాటకం ఆదర్శం - ప్రయోజనం

ఈ నాటకంలో తిరుప్పాణ్ హరిజనుడు, పాణ్ కులస్థుడు కావటంవల్ల కథానాయకుడుగా స్వీకరించటం ఉంది. తిరుప్పాణ్ దేవాలయ ప్రవేశం ఈ కథలో ప్రధానాంశం. వైష్ణవ మత సహిష్ణుత, వైష్ణవ భక్తితత్వం, దాసాను దాసత్వం, హరిజనుడి వైష్ణవభక్తి ప్రధానంగా దీంట్లో ఆదర్శాలుగా కని పిస్తాయి. హరిజనుని దేవాలయ ప్రవేశం, భక్తి మానవ సమానత్వం, మత విషయికంగా శాంతి ఏర్పడి విశ్వశాంతికి మార్గం కావటం మొదలైనవి ప్రయోజనాలుగా వ్యక్తమవుతున్నాయి.

## మోదాంతం :

మునివాహనుడు నాటకం మోదాంతంగా ఉంది. భక్తివీరం అంగిగా; కరుణం, ధర్మవీరం, శాంతం మొదలైనవి అంగరసాలుగా నాటక నిర్మాణం ఏర్పడింది. ఇంగ్లీషు నాటకంలోని 'సబ్లిమేషన్' తుల్యంగా చిత్తవికాసం రస నిర్మాణంలో కనిపిస్తుంది. తిరుప్పాణ్ కోరింది హరిజనుల ఆలయ ప్రవేశం, మానవ సమానత్వం కల భక్తిని మాత్రమే. అంతకంటే అధికంగా ఫలం అనుభ మైంది కాబట్టి అభీష్టార్థసిద్ధివల్ల నాటకం మోదాంతం అయింది. నాటకాంతంలో భక్తుడైన తిరుప్పాణ్ శ్రీరంగనాథునిలో ఐక్యంకావటంకూడ భక్తి విశేషమైన మోదాంతమే.

## ఐక్యత్రయం :

ఇంగ్లీషు నాటకాలలో కథైక్యం, కాలైక్యం, దేశైక్యం అనేవి కనిపిస్తాయి. మునివాహనుడు నాటకంలో కథైక్యం అయిదు అంకాలలోనూ, వివిధ రంగాల లోనూ కనిపిస్తుంది.

కాలైక్యం అనేది తిరుప్పాణ్ భక్తుడుగా ప్రవేశం, కావేరీ ఒడ్డున గాన మాధుర్యంలో మునిగిపోవటం, లోకసారంగముని రాయి విసిరి భక్తుని గాయపర చటం, శ్రీరంగనాథుడు మానవతా దృక్పథంతో భక్తుని రక్షించే గుణంతో, మూఢుని పశ్చాత్తాపుని గావించటం, తిరుప్పాణ్ మునివాహనుడు కావటం కాలై క్యాన్ని సూచిస్తుంది.

తమిళదేశం, కావేరీతీరం, శ్రీరంగనాథ దేవాలయం, వైష్ణవ భక్తుడైన తిరుప్పాణ్ చరితం, హరిజనుని ఆలయప్రవేశం దేశైక్యాన్ని తెలియజేస్తున్నాయి.

ఇందులో కథ, కాలం, దేశం-ఈ మూడు ప్రధానమైన మోదాంత నాటక కథ నిర్వాహణలో ఐక్యత్రయంగా ఆయా సందర్భాలలో ముడిపడి ఉండటం కనిపిస్తుంది. నాటకం సంప్రదాయరీతిలో సాగినా - పాశ్చాత్య నాటక లక్షణం అయిన ఐక్యత్రయం కూడ అంతర్లీనంగా ఆయా దశలలో గోచరిస్తుంది.

## చారిత్రక నాటకం

ఇతివృత్తం వైష్ణవ మత సంబంధిగా ఉంది. తిరుప్పాణాళ్వార్ దుర్మతి నామ సంవత్సరం, కార్తీక మాసం, వృశ్చిక రాశి రోహిణీ నక్షత్రంతో ఉత్తైయూరిలో పాణ్ కులంలో జన్మించాడు. శ్రీరంగనాథుని భక్తుడు. హరిజనులకు నిషేధింపబడిన శ్రీరంగనాథ ఆలయ ప్రవేశానికి కారకుడైన వైష్ణవ భక్తాగ్రగణ్యుడు. పన్నిద్దఱాళ్వారులలో ఒకడుగా ప్రసిద్ధి పొందాడు.

ఆళ్వారుల చరిత్రను కె. యం. మున్షీ, భవాన్స్ జర్నల్ ప్రచురణగా వెలువరించారు. అందులోని ఆళ్వారుల చరిత్రను ప్రధానంగా తీసుకొని ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తిగారి ప్రేరణతో నాటకంగా వెలువరించినట్లు రచయిత పేర్కొన్నారు.[40] ఇది సాంప్రదాయంగా, మిశ్రమంగా, వైష్ణవభక్తి ప్రతిపాదితంగా, మానవత్వ భక్తిమూలకంగా, మోదాంతంగా, విశ్వశాంతి కారకంగా సంప్రదాయ పాశ్చాత్య నాటక లక్షణ సమన్వితంగా రూపొందింది.

## దృశ్య - శ్రవ్యాత్మకం :

ఈ నాటకం చదువుకోటానికి, వినటానికి అనుకూలమైన శ్రవ్యనాటకంగా ఉంది. ప్రయోగదృష్టి కలిగి సామర్థ్యం కల నటులతో ప్రదర్శించటానికి అనువైంది. అందువల్ల దృశ్యాత్మకం కూడా అవుతుంది. ఇందులో పాటలు పద్యాలు ప్రేక్షకులను అలరింపజేస్తాయి. ప్రదర్శనానుకూలమైన నాటకంగా సరళగ్రాంథికంలో రచింపబడింది. దృశ్య, శ్రవ్య నాటక రీతుల సమన్వయం ఉంది. ప్రయోగం, పఠనం రెండింటి పరిధీ సమన్వయం ఉంది.

## వర్గపోరాట లక్షణం :

ఈ నాటకంలో నాయకుడు తిరుప్పాణ్, ప్రతినాయకుడు లోకసారంగ ముని. తిరుప్పాణ్ సౌమ్యుడు. వైష్ణవ భక్తాగ్రగణ్యుడు. లోకసారంగముని దుష్టుడు కాడు. కాని, అతని విశ్వాసం వేరు. తిరుప్పాణ్ ఆకాంక్ష వేరు. ఈ నాటకంలో ద్వివిధ ధర్మసంఘర్షణం ఉంది. విశ్వాస సంఘర్షణం ఉంది. పరిష్కారం ప్రవచించింది శ్రీరంగనాథుడు హరిజనుల దేవాలయ ప్రవేశం అనేది ఆనంద దాయకంగా ముగుస్తుంది.

ఈ విధంగా పాశ్చాత్య నాటకాల్లో కనిపించే కొన్ని లక్షణాలు మునివాహనుడు నాటకంలో ఆయా సందర్భాలలో ఈ కోణాలలో పరిశీలిస్తే వ్యక్తమవుతాయి. ఇవి రచయితలో ఉండే విశాలదృక్పథాన్ని వ్యక్తం చేస్తాయి.

## భాష - ఛందోవైవిధ్యాలు

### భాష :

మునివాహనుడు నాటకంలో వ్యావహారికానికి దగ్గరగా ఉన్న గ్రాంథిక భాషా లక్షణం ఉంది. ఇది పూర్తిగా సలక్షణ గ్రాంథిక భాష. అయితే, ఈ గ్రాంథిక భాష వ్యావహారికానికి చేరువగా ఉండేటట్లు రచన చేయాలనే రచయిత దృష్టి వ్యక్తమవుతుంది. ఉధాహరణకు వేదవేద్యుడు దేవదత్తునితో ''తిరుప్పాణ్ భక్తి పారవశ్యము పరమోత్కృష్టము, సర్వశ్రేష్టము'' అని పేర్కొన్నాడు (నాటకం పుట: 7). పంచమాంకం ద్వితీయరంగంలో దేవదత్తుడు ''ఎన్నో తరాలుగా దేవుని సందర్శింపలేని జాత్యావేదన ఏకీకృతరూప మితడు. తిరుప్పాణ్ ఒక వ్యక్తి కాదు, వ్యవస్థ'' (నాటకం పుట: 69) అని పేర్కొన్నాడు.

ఈ నాటకంలో నాటక కర్త ఇచ్చే సూచనలు పూర్తి వ్యావహారికంలో ఉంటాయి. ఉదాహరణకు-ప్రవేశించి, తెరవైపు చూసి (పుట: 5) రాయి ఇచ్చాడు, రాయి విసిరాడు (పుట: 23) పక్కకు లాగాడు (పుట: 28) శ్రీరంగనాథుడి నుదుట రక్త ప్రవాహం (పుట: 55) లోకసారంగముని భుజాలమీది తిరుప్పాణ్‌తో ప్రవేశించాడు (పుట: 67) తిరుప్పాణ్ కనిపించడం లేదు (పుట: 72) అనేవి కొన్ని కనిపిస్తాయి. వీటిని బ్రాకెటులలో ఉండే మాటలుగా నాటకంలో గమనించవచ్చు.

పాత్రలు చారిత్రక నేపథ్యం నుంచి ఆవిర్భవించాయి కాబట్టి ఆ పాత్రల భాష గ్రాంథికంగా ఉంది. ఈ గ్రాంథికం అనుకొనేంతగా వ్యావహారిక భాషకు దగ్గరగా ఉంది. ఉదాహరణకు ప్రథమాంకంలో వేదవేద్యుడు "దేవదత్తా! తిరుప్పాణ్ కంఠ మాధుర్యం నీకు శ్రవణగతమైనదా లేదా?" అని పేర్కోవటం కలదు. (నాటకం. పుట:6). దేవదత్తుడు "పరమార్థము కనుగొంటిని. స్రష్ట తత్త్వము తెలిసికొంటిని. స్థితి నిశ్చలత కంటిని" అని పేర్కోవటం చూడ

వచ్చును (నాటకం. పుట: 17). అలాగే చతుర్థాంకంలో లోకసారంగముని "పవిత్ర మందిరమునకు మలినమంటి తీరును" (నాటకం. పుట: 49) అని పేర్కొవటం, శ్రీరంగనాథుడు "మానవునకు మాధవునకు మధ్య మలినము లేదు" (నాటకం. పుట:49) అని వెల్లడించటం పేర్కొవచ్చు. చిన్నయసూరి వ్యాకర ణానికి అనుకూలమైన రీతిలోనే రచనారీతి కనబడుతుంది. ఇది నీతిచంద్రికలోని వచన రచనా రీతిని దాటినట్లుగా ఉంది. సరళ గ్రాంథికంలో రచించటం వల్ల వ్యావహారిక రీతికి దగ్గరగా ఉన్నట్లు కనిపిస్తుంది. ముఖ్యంగా పాఠకులను దృష్టిలో పెట్టుకొని ఈ విధంగా తీర్చిదిద్దటం రచయిత భాషానైపుణ్యానికి తార్కాణం పేర్కొవచ్చు.

## ఛందస్సు :

"శ్రీరంగనాథుని దివ్య సౌందర్యము నఖశిఖ పర్యంతము రమణీయ ముగా తిరుప్పాణ్ కీర్తించటము చూడవచ్చు."[41] తమిళంలో పది పాశురాలు రచించినట్లుగా "మునివాహన భోగము" అనే గ్రంథాన్ని వెలయించినట్లుగా పేర్కొబడింది.[42] ఈ నాటకంలో పాటలు రాయటంలో సంకీర్తనం, వైష్ణవ భక్తిత్వం, అష్టవిధ భక్తితత్వంతోపాటు వైష్ణవ గీతి మాధుర్యం కనిపిస్తుంది. పాటలకు దగ్గరగా ఉండే పద్యాలు, పాటలలాంటి పద్యాలు ప్రధానాంశాలుగా కనిపిస్తాయి.

ముత్యాల సరములాంటి పాటలు చాలా సందర్భాలలో మాత్రాగణ బద్ధంగా ఉండటం రచయితకు మహాకవి గురజాడ మీద ఉండే అభిమానాన్ని చాటి చెబుతుంది. పాట అనేది ఈ నాటకంలో ప్రధాన లక్షణంగా ఉంది. ఇది సంప్రదాయంలోని కీర్తన అనేదానికి దగ్గరగా ఉంది. "తెలుగు ముత్యముల కోవ వలె ముద్దైన లిపి గల భాష. తెలుగు పలుకు ముత్యము వంటిది. ముత్యము రూపమున చిన్నది, తేటదనము గలది. అట్లే చిన్న చిన్న తేటమాటల కూర్పు గురజాడ కవిత్వము. తాను తెలుగు పలుకుబడికి ప్రాధాన్యమిచ్చి తెలుగు దేశి ఛందస్సులో కవిత్వము వ్రాయుచున్నాడు. కావున మిశ్ర గతిలో నడచు ఛంద స్సునకు తన అభిరుచి కనుగుణముగా 'ముత్యాల సరాలు' అని పేరు పెట్టుకొని యుండును"[43] అని ముత్యాల సరాల లక్షణాన్ని డా. సి. నారాయణరెడ్డిగారు పేర్కొన్నారు.

ముత్యాల సరాలలో నాలుగు పాదాలు ఉంటాయి. మొదటి పాదాలలో మూడు + నాలుగు, మూడు + నాలుగు = పదునాలుగు మాత్రలు ఉంటాయి. నాలుగో పాదములో ఏడు మొదలు పదునాలుగు వరకు ఉంటాయి. గురజాడ ముత్యాల సరాలలో ఈ నియమం కనిపిస్తుంది.[44] గురజాడ ముత్యాల సరాల గేయాల అనుసరణం ఈ నాటకంలో అక్కడక్కడ కనిపిస్తుంది.

ఉదా : "నీవు నాకు దేవుడవని
నీకు నేను భక్తుడనని
నీకు తెలియు నాకు తెలియు
లోకమునకు నేమి తెలియు?"[45]

ప్రతి పాదంలో పన్నెండు మాత్రలు ఉండేదానికి ఉదాహరణగా ఉంది. ముత్యాలసరం లక్షణం మీద ప్రయోగంగా ఉన్న పాట గమనింపవచ్చు.

"చూచితివా కావేటిరంగా!
మొర వింటివా శ్రీరంగ రంగా!
భువి కదలెను దివి కదలెను
దిగంతా లెల్లను కదలెను."[46]

అలాగే పాదమధ్యంలో అధిక మాత్రలుండేదానికి ఉదాహరణగా-

"రాయి తగిలెను రక్త మొలికెను
ఏమి అయినది ఇంతలో
నాకేమి అయినది ఇంతలో
రంగనికేమి అయినది ఇంతలో
సూర్య చంద్రులె ఉదయ మొందక
నిద్రపోవుచు నుండిరా!"[47]

అనే దానిని పేర్కొనవచ్చును. ఈ విధంగానే ముత్యాలసరంతో మార్పు గమనించవచ్చు.

"ఇది మాధవుడేలిన భూమి
నర మానవుడంటని భూమి.''48

ముత్యాలసరం పాటగా మార్చడంతో పొందిన మార్పును గమనించవచ్చు.

"సర్వ సంగ త్యాగివా
సర్వ భోగ యోగివా
దేవ నన్ను బ్రోవ ఇటురావా?"49

ముత్యాలసరం స్థాయిని దాటిన పాటనుకూడా దర్శింపవచ్చు:

"శ్రీరంగనాథా శ్రీరంగధామా
నన్నుగన్న తండ్రి నా కన్న తండ్రి"50

"ఎన్నినాళ్ళ కెన్నినాళ్ళ కెన్నినాళ్ళకి
కన్నులున్న దానియేలు కలసి వచ్చెరా"51

"దేవా నన్నుకావ దిగిరావ
దివినుండి భువిపైకి నను చేర దిగిరావ''52

"ఇది నీ వినోదమా - దేవా
ఇది నీ విలాసమా?''53

ఈ విధంగా మునివాహనుడు నాటకంలో ముత్యాలసరాల రీతిలో పాటలు సంకీర్తన రూపంలో కనిపిస్తాయి. ఇవి వైష్ణవగీతి మాధుర్యాన్ని, భక్తితత్త్వాన్ని పాఠకులకు తెలియజేస్తున్నాయి.

## వివిధ ఛందోరీతులు :

మునివాహనుడు నాటకంలో తేటగీతులు, ఆటవెలదులు, సీసపద్యాలు, కందపద్యాలు కనిపిస్తాయి. పాటకు దగ్గరగా ఉండే పద్యం నడక కనిపిస్తుంది. ఎక్కడో తప్ప రచయిత వృత్తాల జోలికి పోలేదు. దీంట్లో భక్తిభావం, వైష్ణవ

భక్తిత్వం కనిపిస్తూ ఉంటుంది. పద్యరచనలో సంప్రదాయాన్ని అతిక్రమించటం రచయిత బుద్ధిపూర్వకంగా చేసినట్లుగా గుర్తించవచ్చు. చతుర్థాంకం ద్వితీయ రంగంలో లోకసారంగముని శ్రీరంగనాథునితో చెప్పే సందర్భంలో-

"ఎంతమాట తండ్రి! ఎంతమాట రమేశ!
కన్నులార నిన్ను గావించుచుంటి
నిన్ను చూచి తండ్రి! మిన్ను చూచితి తండ్రి
నిన్ను గంటి స్వర్గమెన్నగంటి
నాదు జన్మమ్ము ధన్యమ్ము! నాదు బ్రతుకు
నిండు చంద్రోదయమ్ము
నాదు జీవమ్ము పుణ్యమ్ము నాదు తనువు
పూచు నందనోద్యానమ్ము
నాదు ప్రాణ మానందమ్ము, నాదు రుధిర
మురుకు గంగా తరంగమ్ము
నాదు ప్రాణమ్ము తేజమ్ము, నాదు గుండె
విరియ పారిజాత సుమమ్ము."[54]

ఇక్కడ పాటకు దగ్గరగా ఉండే పద్యరచన, పాటలాంటి పద్యం ప్రధానాంశమైనందువల్ల సంప్రదాయాన్ని అతిక్రమించటం గమనించవచ్చును. ఈ పద్యరచనలో ఛందస్సు విషయంలో తీసుకొన్న స్వేచ్ఛను గుర్తింపవచ్చు.

## సంభాషణాగమనం :

సంభాషణ వచన కవిత్వంగా మారిన సందర్భాలు అనేకం ఉన్నాయి. భక్తి కారణంగానే ఇవి ఇలా ఏర్పడ్డాయి. రెండు పాత్రలు మాట్లాడితే సంభాషణ అవుతుంది. ఒకే పాత్ర మాట్లాడితే స్వగతమవుతుంది. ఈ నాటకంలో స్వగతాలు లేవు. తిరుప్పాణ్ మాటలు స్వగతాలుగా పాఠకులకు అనిపించినా, అవి శ్రీరంగనాథునితో తిరుప్పాణ్ తెలుపుతున్నవని గుర్తించాలి. రెండుకంటే ఎక్కువ పాత్రలు ఒకే సన్నివేశంలో చేసే సంభాషణ మరింత పటిష్ఠంగా బిగువుగా ఉంది. అందువల్లే ఈ నాటకంలోని సంభాషణలలో కొంత కొత్తదనం చూడవచ్చు.

సంభాషణా నైపుణ్యానికి ఉదాహరణ :

''శ్రీరంగ : మునీ! విను - నాకు మలినమంటదు.
లోక : కావచ్చు!
శ్రీరంగ : మరి?
లోక : పవిత్ర మందిరమునకు మలినమంటితీరును.
శ్రీరంగ : మానవునకు మాధవునకు మధ్య మలినము లేదు.
లోక : కాని, పంచమునకు పవిత్రాలయమునకు మధ్య మాలిన్యమున్నది.
శ్రీరంగ : దేవుని కంటని మైల దేవాలయమున కంటదు!''[55]

ఈ విధంగా సంభాషణ పలకటం కంటె, నటించటం అనే అంశం ప్రధానంగా కనిపిస్తుంది. నటించే గుణంకల సంభాషణలు ఈ నాటకంలో సాధించిన మేలి గుణాలుగా కనిపిస్తాయి.

ఈ నాటకంలో కావేరీ నదీ వర్ణన మొదలైనవి స్వభావసిద్ధంగా ఉన్నాయి. ఋతువర్ణన, శ్రీరంగక్షేత్ర వర్ణన, దేవాలయ వర్ణన మొదలైనవి సహజసిద్ధం గానే కనిపిస్తాయి.

## నాటక కథ

### మునివాహనుడు - కథాప్రాధాన్యం:

ఆళ్వారుల వైష్ణవ భక్తి సంప్రదాయం : ''ఆళ్వారు'' అనగా "లోతుకు పోయినవాడు, లోతునెరిగిన వాడు'' అని భావం. భగవద్భక్తి ఫలితమున బడసిన పరమానందసముద్రము యొక్క లోతునెరింగినవాడు ''ఆళ్వారు'' అని వివరింపబడింది.

వీరు ఎలాంటి వారో తెలుపుతూ 'ఆళ్వారులు భక్తి పరవశమున నుండి, భగవంతుని అనంత దివ్యమంగళ విగ్రహమును వారి మనో నేత్రములతో తిల కించుచూ, తన్మయభావమున సంశ్లేష భావమున భగవంతునితో నేరుగా సంభా షించుచు, భగవంతుని బిగ్గరగా, గంభీరముగా, సంస్కృత శ్లోకములతో, తమిళ

పాశురములతో, దివ్య కీర్తనలతో, సంకీర్తనమును గావించుచూ, ఆనంద సాగర మున మునిగి తేలుచుండిన దివ్య ఆనంద తేజోమయులు. అనంతమైనట్టియు, అనిర్వచనీయమైనట్టియు ఆ దివ్య ఆనందమును పొంది అనుభవించినవారు ఆళ్వారులు'' అని విశదీకరింపబడింది.[56]

వీరి భక్తిని గురించి "భక్తి మార్గమున బడయనగు ఆనందము యిక యే యితర మార్గముననను లేదను భావము వారిది. సర్వాంతర్యామి యగు వైష్ణవ శక్తికి ప్రపత్తులైన మానవాళియందు శాంత, సహన, సౌహార్ద్ర, సహకార భావములు నెలకొని వృద్ధియగును''[57] అని పేర్కొబడింది.

వీరి జీవిత విశేషాలు తెలుపుతూ ''ఆళ్వారుల జీవితము నుండి గ్రహింప దగిన విషయమేమనగా- వర్ణ, జాతి, భాషాభేదములకు మానవుడు అతీతుడై, కల్యాణ గుణ ప్రపూర్ణుడై మెలగి, ఆనందమున నుండవలయునని. ఇందు వృత్తికి ప్రాధాన్యత లేదు. యజ్ఞయాగాదులకు, ఆచారములకు, కట్టు బొట్టు జుట్టులకు ప్రాధాన్యత లేదు లోక కల్యాణార్థము స్వార్థ రహిత జీవితమును గడుపుచూ అనిర్వచనమును, అవాఙ్మానస గోచరమును ఐన వైష్ణవ శక్తి గుణ గానము చేసి ప్రపత్తుడై ఆనందమున నోలలాడుటయే మానవుని ధ్యేయముగా నుండవలయును. ఈర్ష్య అసూయలు యెరుగనివారు ఆళ్వారులు"[58] అని చెప్పబడింది.

## నాటక కథ ప్రాధాన్యం :

సాధారణంగా నాటకాలలో కథ ప్రఖ్యాతం, ఉత్పాద్యం, మిశ్రమం అనే మూడు రకాలలో ఏదో ఒక విభాగానికి చెంది ఉంటుంది. నాటకంలో కథ మూల వస్తువు. దీనినిబట్టి బంగారాన్ని శిల్పి అందమైన ఆభరణంగా రూపొందించి నట్లు, రచయిత నాటకాన్ని సృష్టిస్తాడు.

ప్రస్తుతం నాటకంలోని కథ వైష్ణవ మత సాహిత్యంలో సుప్రసిద్ధమైంది. పన్నిద్దఱాళ్వారులలో ఒకడు పంచముడు. అతను ఈ నాటకమందలి కథా నాయ కుడు 'తిరుప్పాణ్ ఆళ్వారు.' ఇతివృత్తం అతని జీవిత గాథకు సంబంధించింది. ''జన్మ వల్ల కాదు, కర్మ వల్ల పవిత్రతాపవిత్రతలు ప్రవర్తిల్లుట''[59] అనే

సూత్రాన్ని ప్రతిపాదిస్తూ, ద్రావిడ ప్రబంధాలలో ప్రసిద్ధం కావటంవల్ల ఈ నాటకంలోని ఇతివృత్తం ప్రఖ్యాతమైంది.

## రచనారీతి - అంక ప్రాధాన్యం :

నాటకంలోని కథావస్తువు చరిత్రకు సంబంధించింది. దీనిని గ్రహించి కొన్ని కల్పనలతో అస్పృశ్యతా జాడ్యాన్ని అంతరింపచేయటానికి, హెచ్చుతగ్గులు లేని సమాజ సృష్టి చేయటానికి నాటక రచయిత దీనిని కాలానుగుణంగా రచించారు.

దీంట్లో ఐదంకాలు ఉన్నాయి. ఒక్కొక్క అంకంలో ఒక దినంలో జరిగిన వృత్తాంతం చెప్పబడింది. ప్రతి అంకంలో నాయకుడు కనిపిస్తాడు. అంకాలను రంగాలుగా విభజించటం గోచరిస్తుంది. ఇది పాశ్చాత్య నాటక సంప్రదాయం. నాటకంలో మూడు, నాలుగు, ఐదు అంకాలు వరుసగా రెండు రంగాలుగా విభజించడం కనిపిస్తుంది.

నాటక ప్రారంభం నాందీ పద్యంతో మొదలవుతుంది. ప్రస్తావన సూత్రధారుడు చెప్పినట్లుగా, ప్రథమాంకం తిరుప్పాణ్ పాటతో మొదలవుతుంది. ప్రవేశక విష్కంభకాల ప్రయోజనం వేదవేద్యుడు, దేవదత్తుడు పాత్రల ద్వారా చేకూర్చటం జరిగింది. చివరగా భరతవాక్యంతో నాటకం ముగుస్తుంది. "ఈ తిరుప్పాణ్ ప్రకాశమే యిలకు మిగుల...."[60] అనేది లోకసారంగముని దీవెన.

## రచయిత కథను మలచిన తీరు :

వైష్ణవ సాహిత్యంలో ప్రసిద్ధులైన పన్నిద్దఱాళ్వారులలో తిరుప్పాణ్ ఆళ్వారు ఒకడు. ఇతడు పంచమ కులజుడు. "పాణ్ కులస్థులు సంగీతవేత్తలు, ప్రియులు; వాద్య సంచాలకులు, ప్రయోక్తలు, ప్రధానంగా వీణావాదన నిపుణులు. మొదట్లో వీళ్ళు రాజాస్థానాలాశ్రయించుకొని జీవించారు, గౌరవాలు, గౌరవ భృతులు పొందారు"[61] అని పేర్కొబడింది. తిరుప్పాణ్ పాటలను చక్కగా పాడుతాడు. శ్రీరంగనాథుని గూర్చి సంకీర్తన మొనర్చి దర్శించి తరించాలనెడి కోరిక కలవాడు. పై విషయాలను దృష్టిలో పెట్టుకొని తిరుప్పాణ్ జీవితంలో అతి ముఖ్యమైన సన్నివేశాలను గ్రహించి అంకాలుగా విభజించటం కనిపిస్తుంది.

తిరుప్పాణ్ విషయాన్ని బలీయమొనర్చటంకోసం నాలుగు పాత్రలను మాత్రమే స్వీకరించడం చూడవచ్చు. వీటిలో తిరుప్పాణ్ పంచమ కులజుడు. ఆలయ ప్రవేశాన్ని కోరువాడు. వేదవేద్యుడు అతని కోరికను సమర్థిస్తాడు. లోకసారంగముని దేవాలయ అర్చకుడు. పంచములకు ఆలయ ప్రవేశాన్ని గర్హించే వ్యక్తి. ఇతనికి అనుకూలంగా దేవదత్తుని పాత్ర ప్రవర్తిస్తుంది. దీనికి తోడుగా శ్రీరంగనాథుడు తిరుప్పాణ్‌కు అనుకూలంగా వాదన చేసి, లోకసారంగ మునిచే ఔననిపించి, కథను పరిసమాప్తి చేయడం కనిపిస్తుంది.

ఈ విధంగా పరిమితమైన పాత్రలతో, మహోన్నతాలైన ఆశయాలను నాటకం ద్వారా సిద్ధింపజేసి, హరిజనోద్ధరణ, సమసమాజ స్థాపన, సర్వ మానవ సోదర భావాలను సాధించారు.

## నాటకీయత - పాత్ర శిల్పం

'ముని వాహనుడు' నాటకంలో రచయిత చాలా నేర్పుతో పాత్రలను ప్రవేశ పెట్టటం ఉంది. కథలో ప్రధానంగా కనిపించే విషయం తిరుప్పాణ్ జీవిత వృత్తాంతం. తిరుప్పాణ్ అస్పృశ్యుడు. ఆలయప్రవేశం లేదు. సమాజంలో వీటిని సాధించటం రచయిత ప్రధాన ఆశయంగా కనిపిస్తుంది. ఈ ఆశయాన్ని సాధించటానికి తగిన పాత్రలను నాటకంలో ప్రవేశపెట్టటం చూడవచ్చును.

తిరుప్పాణ్ పాత్ర అభ్యుదయ భావాలు కలదిగా మనం చూడవచ్చు లోకసారంగముని పాత్ర సంప్రదాయానికి ఆచారాలకు ప్రతీకగా కనబడుతుంది. వేదవేద్యుడు తిరుప్పాణ్‌ను సమర్థిస్తే, దేవదత్తుడు లోకసారంగముని వాదనను సమర్థిస్తాడు. వీరిరువురి మధ్య సయోధ్య సాధించటానికి శ్రీరంగనాథుడు భగవంతుడే అయినా, చైతన్యమూర్తిగా దర్శనమిస్తాడు.

ఈ నాటకంలో, ముఖ్యంగా చతుర్థాంకంలో గుడి, దేవుడు, సమాజం విషయమై జరిగిన చర్చ మహోన్నతంగా ఉంది. లోకసారంగముని "రంగ

నాథా! నీవు పంచములకు ప్రత్యక్షము కారాదు"[62] అని సమాజంలో అస్పృశ్యునికి ఆలయ ప్రవేశం ఉండకూడదంటాడు. లోకసారంగముని దృష్టిలో గుడి ప్రాముఖ్యం "ఆలయమనగా మేమే! నీ వున్నది మా కొరకు, మా కొరకు కాని పక్షాన నీవిక్కడ ఉండవు. అందువల్ల మా భక్తి నీకు బందిఖానా. నిన్నిక్కడ నుండి కదలనీము. బైటికి పోనీము. ఇతరులను లోనికి రానీము. అది మా యిష్టము. నీ యిష్టమున కిక్కడ చోటులేదు. కాని, నీ యిష్టము మా అభీష్టాంతరముగా ఉండవలసినదే! మేము వినా నీకు ప్రత్యేక అస్తిత్వము ఇక్కడ లేదు. ఇది మా హృది. ఇది నీ ఖైదు. ఇది దేవాలయము. మలినము కారాదు. నీ కోరిక మా కోరిక భేదించినచో తీరునది మా కోరికే - తీర్చునది మేము కాబట్టి! నీ కోర్కె కూడ తీర్చగలము. ఎప్పుడనగా, అది మాకభిమత మయినప్పుడు! ఇది నీవన్నది మాకిష్టము కాదు. కనుక తీరదు. ఏమైనను కానిమ్ము!"[63] అని మౌఢ్యంతో పలకటం చూడవచ్చును. ఇలాగ వివిధ కోణాలనుండి దర్శించినపుడు నాటకంలోని ఆయా పాత్రలను కథానుగుణంగా వర్తింపజేసి, పాత్రల ప్రయోజనం సిద్ధింపచేయటంలో, రచయిత కృతకృత్యులు అయినారని అనిపిస్తుంది.

## పాటలు - పద్యాలు :

సంప్రదాయ నాటకాలలో పద్యాలు ఉండటం సహజం. ఈ నాటకం సంప్రదాయానికి సంబంధించింది కాబట్టి ఇందులో పద్యాలు ఉన్నాయి. పాటలు ఉండటం ఆంగ్లనాటక సంప్రదాయం. ఆంగ్ల నాటకాలలో బృందగానాలు ఉంటాయి. నాటక ఇతివృత్తాన్ని, పాత్రని దృష్టిలో పెట్టుకొని పాటలను నాటకంలో ప్రవేశ పెట్టినట్లు అనిపిస్తుంది.

ఈ విధంగా 'మునివాహనుడు'లో ప్రాచ్య - పాశ్చాత్య నాటక లక్షణాల సమన్వయం నూతనంగా ఉంది. కథాచిత్రణంలో నవ్యత్వం గోచరిస్తుంది.

## పాదసూచికలు

1. ఆళ్వారుల దివ్యవైభవం పుట : 3
తిరువాయిపాటి రాఘవయ్య
2. నాటకం పుట : 6
3. పైదే పుట : 6
4. పైదే పుట : 21
5. ఆళ్వారుల దివ్యవైభవం పుట : 6
తిరువాయిపాటి రాఘవయ్య
6. మునివాహనుడు నాటకం పుట : 7
7. పైదే పుట : 12
8. పైదే పుట : 7
9. పైదే పుట : 7
10. పైదే పుట : 8
11. పైదే పుట : 8
12. పైదే పుట : 68
13. కోలాచలం శ్రీనివాసరావు
- నాటక సమాలోచనం పుట : 207
డా. ఎస్. గంగప్ప
14. మునివాహనుడు నాటకం పుట : 12
15. పైదే పుట : 13
16. పైదే పుట : 21
17. పైదే పుట : 21
18. పైదే పుట : 23
19. పైదే పుట : 62
20. పైదే పుట : 77
21. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము పుట : 193

22. పైదే పుట : 194
23. మునివాహనుడు నాటకం పుట : 5
24. పైదే పుట : 5
25. పైదే పుట : 79
26. పైదే పుట : 76
27. సాహిత్యశిల్పసమీక్ష పుట : 219
28. పైదే పుట : 219
29. సాహిత్యభావ లహరి పుట : 138
30. సాహిత్య దర్శిని పుట : 45
31. మునివాహనుడు నాటకం పుట : 43
32. పైదే పుట : 73
33. పైదే పుట : 16
34. పైదే పుట : 17
35. పైదే పుట : 28
36. పైదే పుట : 30
37. పైదే పుట : 38
38. పైదే పుట : 60
39. రచయితతో ముఖాముఖీ
40. రచయితతో ముఖాముఖీ
41. ఆళ్వారులు - దివ్యప్రబంధములు పుట : 95
42. పైదే పుట : 96
43. ఆధునిక ఆంధ్ర కవిత్వము - సంప్రదాయములు-ప్రయోగములు పుట : 212
44. పైదే పుట : 212
45. మునివాహనుడు నాటకం పుట : 17
46. పైదే పుట : 24
47. పైదే పుటలు : 28,29

| | | |
|---|---|---|
| 48. | పైదే | పుట : 38 |
| 49. | పైదే | పుటలు : 40,41 |
| 50. | పైదే | పుట : 43 |
| 51. | పైదే | పుట : 45 |
| 52. | పైదే | పుట : 60 |
| 53. | మునివాహనుడు నాటకం | పుట : 65 |
| 54. | పైదే | పుట : 46 |
| 55. | పైదే | పుట : 49 |
| 56. | ఆళ్వారుల దివ్యవైభవము | పుట : 3 |
| 57. | పైదే | పుట : 5 |
| 58. | పైదే | పుటలు : 6,7 |
| 59. | మునివాహనుడు నాటకం | పుట : 55 |
| 60. | పైదే | పుట : 76 |
| 61. | పైదే | పుట : 77 |
| 62. | పైదే | పుట : 47 |
| 63. | పైదే | పుటలు : 52, 53 |

# 5. మునివాహనుడు-మత ప్రాత్ర రసదృష్టి

## మత ప్రస్థానం

భారతీయ సాహిత్యాలలో ధర్మం, నీతి, తత్త్వం, మతం మొదలైన విషయాలు చోటు చేసుకొన్నాయి. అనేక నాటకాలలో పౌరాణిక, పారమార్థిక, చారిత్రక అంశాలుండే వాటిలో తత్త్వం, మతం అనేవి కొంత కనిపిస్తాయి. త్రిమతాచార్యులు బోధించిన మతాల రీతులు, జైన, బౌద్ధ మతదర్శనాల రీతులు, షడ్దర్శనాల విధానాలు, ఇస్లాం మత బోధనలు మొదలైనవి తీరుతీరులుగా కనిపిస్తాయి.

మునివాహనుడు నాటకంలో వైష్ణవ మత దర్శనం కనిపిస్తుంది. ఇతి వృత్తంలో శ్రీరంగం, కావేరీతీరం, శ్రీరంగనాథుడు, దేవదత్తుడు, వేదవేద్యుడు, లోకసారంగముని, తిరుప్పాణ్ ఆళ్వార్ మొదలైనవారు వారివారి మతం తీరుల్లో గోచరిస్తారు. ఈ నాటకంలో శ్రీవైష్ణవ సంప్రదాయరీతి కనిపిస్తుంది. శ్రీరామానుజులు "విష్ణోపరమం పదం"[1] అని శ్రీమహావిష్ణువుని భగవంతునిగా, సాకారుడైన గుణసహితునిగా పేర్కొన్నారు.

భగవంతునిలో కనిపించే స్వరూపగత విగ్రహగుణాలని తెలిపారు. భక్తులను పీడించే, మదాన్ని అణచివేసే గుణాలు; భక్తులను ఆకర్షించే గుణాలు అని రెండువిధాలుగా పేర్కొన్నారు. భగవంతునిలో ఉండే తొమ్మిది గుణాలు, ఆయన దివ్యమంగళ విగ్రహ స్వరూపంలో ఉండే ఆరు గుణాలు పేర్కొన్నారు. రామానుజులు జీవ స్వరూపాన్ని, భక్తి స్వరూపాన్ని, భక్తుని లక్షణాల్ని, నవవిధ భక్తుల్ని, జప విశేషాల్ని పేర్కొన్నారు. భక్తి, ప్రపత్తి, శరణాగతి వైష్ణవంలో అంగీకరించిన మోక్షమార్గాలుగా ఉన్నాయి.[2]

మునివాహనుడు నాటకంలో తిరుప్పాణ్ జీవితమే ఒక దీర్ఘ శరణాగతిగా కనిపిస్తుంది. నిత్యం శ్రీరంగనాథుని గానం చేయటం, తనివితీర ఆనందించటం కనిపిస్తుంది. ఆళ్వారుల నాటినుండి వెలసిన విశిష్టాద్వైత మత గ్రంథాలు ఈ శరణాగతి తత్త్వ విషయాన్ని పరిపరివిధాల ప్రతిపాదిస్తున్నాయి.[3]

పంచమకులంలో పుట్టిన ఇతనికి హరి సంకీర్తనం, గానమాధుర్యం చిన్నప్పటినుండి అలవడ్డాయి. అయినా, లోకసారంగముని మతమౌఢ్యం వల్ల, ఆనాటి అర్చకుల మత దురహంకారం వల్ల కొంతకాలం తిరుప్పాణ్‌కు శ్రీరంగనాథుని ఆలయ ప్రవేశం, దివ్యమంగళ విగ్రహ సందర్శనభాగ్యం లభించలేదు.

మునివాహనుడు నాటకంలో మతప్రస్థానం అనేది సామాజిక నేపథ్యంలో చిత్రించబడింది. అచంచలమైన భక్తి ప్రపత్తులు, హరినామ సంకీర్తనాన్ని గానం చేసే తిరుప్పాణ్‌కు, మతానికి నిలయమైన ఆలయప్రవేశం లేకపోతే "దేశ భవితవ్యమేరీతి తేజరిల్లు?" అని తపశ్శక్తి, భవ్యగాన దీప్తి, దీక్ష కలిగి ఉన్న వ్యక్తిని పంచమ కులజుడు అనే పేరుతో భంగపరచరాదు. ఈ మానవతా ప్రబోధాన్ని మతంతో కలిపి చెప్పటం కనిపిస్తుంది. మంచి భావాలు కలుషితమౌతుంటే, ధర్మ నియమాలు దూషితాలౌతుంటే దేవుడే మైల అయిన తరువాత, స్వర్గ సుఖాలనేవి నరక సదృశాలౌతాయని వ్యక్తం చేయబడింది.[5] ఆర్య సంప్రదాయాలలో వైదిక కాలం నుండి చాతుర్వర్ణ్య వ్యవస్థ సంఘంలో నెలకొల్పబడి, బలహీనుల పాలిట అభిశాపం అయ్యింది. నాలుగు వర్ణాల వారికి పరస్పరం గౌరవించుకొనేటట్లు సంఘంలో స్థానం కల్పించటం అనేక సందర్భాలలో కనిపిస్తుంది. ఈ నాటకంలో లోకసారంగముని "పంచముని పాదధూళితో పవిత్ర దేవాలయము మైలపడరాదు. పోనీను"[6] అనే మాటలలో మత మౌఢ్యం తీరు కనిపిస్తుంది. లోకసారంగముని ధర్మమడుగంటిపోయిందని, అధర్మానిదే పైచేయి అయ్యిందని, ఇలాగుంటే "ఇంక భవితవ్య మీ రీతి నెన్నుకొనునో"[7] అని వాపోవటం మత చాదస్తానికి తార్కాణంగా కనిపిస్తుంది.

తిరుప్పాణ్ మధుర గాయకుడు, మహాభక్తుడు, చదువు సంధ్యలు లేని పంచముడు. శ్రీరంగనాథుని చూడనైనా చూడని అంటరానివాడు. అయినా, తిరుప్పాణ్ భక్తిపారవశ్యం పరమోత్కృష్టం, సర్వశ్రేష్ఠం. అతనిది పంచముల

పంచమునుల స్వరం. ఆ భక్తి మహర్షుల భక్తిపారవశ్యంగా అని తెలుస్తుంది. తిరుప్పాణ్వి వ్రాత లేని పాటలు. అందువల్లే అవి "గాలి పాట - గాలికి పోవలసి నదే"9 అని దేవదత్తుడు పేర్కొన్నదాంట్లో హరి సంకీర్తనం సర్వాంతర్యామి అనేది ధ్వనిస్తుంది.

శ్రీరంగనాథుని దర్శించటానికి అస్పృశ్యుడు అయిన తిరుప్పాణ్ నిరాక రింపబడినాడు. కానీ, శాంతచిత్తంతో భక్తితత్పరతతో శ్రీరంగనాథుని సంకీర్తనం చేస్తూ పరవశంతో గుడి ముందు శాంతచిత్తుడై కూర్చున్నాడు. అతనిలోని భక్తి, జ్ఞాన, సంకీర్తన తత్త్వాన్ని గమనించని దేవదత్తుడు తిరుప్పాణ్‌లో శాంతత లేదని పేర్కొన్నాడు. అయినా, త్రిగుణాతీతమైన భక్తి మార్గదాయకమైన గుణాలు కలిగిన మహనీయుడైన తిరుప్పాణ్ ''నవ్వేన నావచేను పండినదన్న మాట''10 అని యదార్థం చెబుతున్నట్లుగా ఉంది.

పంచములకు ఆలయ ప్రవేశం చాలా కాలం కల్పించబడలేదు. రామానుజాచార్యులు భక్తిప్రపత్తులు ఉంటే కుల మత ప్రసక్తి ఉండరాదని బోధించినా, మత దురహంకారులు వారి సర్వ మత, సమానత్వ ప్రబోధాన్ని ప్రక్కకు నెట్టివేశారు. ఇదే లక్షణంతో లోకసారంగముని ఇసుక తిన్నెపై భక్తి పారవశ్యంతో మైమరచి ఉన్న తిరుప్పాణ్‌ని 'పంచమాధమూ, నరపశువా, ధూర్త, దుష్ట, దుర్మార్గ, మదాంధమానవ లేచిపొమ్మ' అని, ''నేనిచ్చటనే అభిషేకజలము తీసికొనిపోక తప్పదు. ఓరీ! కదలవు కదా? నీ కిదే శాస్తి!''11 అని రాయి విసిరి గాయపరుస్తాడు. కాని, తిరుప్పాణ్ కనులు తెరచెనే కాని ధ్యాన సమాధి విడువ లేదు.

మత దురహంకారి మానసిక పావిత్ర్యము మలిన దూషితమైతే ఓర్చలేదు. "పంచముడు తపస్సు చేయరాదు. అది సాధ్యము కాదు"12 అనే భావన మత ఛాందసులలో కనిపిస్తుంది. "భగవంతుని అనుగ్రహముంటే ఏటి నీరు అభిషేక జలమౌతుంది. తోటలోని పువ్వు పూజా పుష్పమౌతుంది. ఆ అనుగ్రహం లేనినాడు నింగి చుక్క నేలపాలౌతుంది. అమృత బిందువే విషసింధువుగా మారుతుంది"13 అని భగవంతుని అనుగ్రహతత్త్వాన్ని ఈ నాటకంలో చెప్పటం

కనిపిస్తుంది. లోకసారంగమునిలో అగ్రవర్ణాలు అనే అహంభావం ఉంది. అందు వల్లే తిరుప్పాణ్‌ని పంచముడు అని వేలెత్తి చూపటం కనిపిస్తుంది.

'మానవసేవే మాధవసేవ' అనేది సంస్కర్తలు ప్రబోధించింది. అందు వల్లే "మానవునకు మాధవునకు మధ్య మలినము లేదు" (నాటకం. పుట : 49) అనే మాటలలో భగవంతుడు చెప్పిన మతంలోని మానవతాగుణం వ్యక్తమౌ తుంది. కావున "దేవునికంటని మైల దేవాలయమున కంటదు" (నాటకం. పుట : 49) అనే సర్వమత సమానత్వాన్ని భగవంతుడు చాటి చెప్పటం కనిపిస్తుంది. ఇదే విషయాన్ని "సంస్కృతి తాత్విక రంగాలలో ఆదానప్రదానాలు ఎప్పుడూ వున్నవే. చారిత్రకంగా సంక్రమించిన బలహీనతలను అధిగమించి ఏకత్వంలో భిన్నత్వంగల విశ్వసంస్కృతి, విశ్వజనీన తత్త్వశాస్త్రాల ఆవిర్భావానికి ఆదాన ప్రదానాలే మార్గం"[14] అనేదాన్ని చెప్పారు.

సంఘసంస్కర్తలు కూడ కుల, మత, వర్గరహిత సమాజస్థాపనా ధ్యేయంతో అనేక ఉద్యమాలు నడిపి సంఘంలోని మూఢాచారాల్ని తొలగిం చారు. అందువల్లే, ప్రాచీనకాలం నుంచి "మోక్షసాధనకు మూడు పద్ధతులు యేర్ప డ్డాయి. జ్ఞానమార్గం, కర్మమార్గం, భక్తిమార్గం. కర్మమార్గమనేది మతసంబంధ మైన కర్మలు. అనుష్ఠానాలు పెరగడానికి దారి తీసింది. భక్తిమార్గం సాకార దేవుని పట్ల భక్తిప్రపత్తులను ప్రచారం చేసింది. జ్ఞానమార్గం ధ్యానం, ప్రాణా యామంలాంటి ఆచరణలకు దారితీసింది."[15]

సంఘసంస్కరణోద్యమాల మూలంగా సమాజం గురించి ఆలోచనాత్మక భావాలు వ్యాప్తి చెందాయి. కుల నిర్బంధాలు సడలాయి. పాత సంప్రదాయాలు, అనాచారాలు ఉండే సమాజం మారాలి అనే సామాజిక స్పృహ ఏర్పడింది. మత ప్రబోధకులు, సంస్కర్తలు, ప్రముఖ రాజకీయ వేత్తలు, తాత్త్వికులు ఆకాంక్షిం చేది కూడ సర్వమత సమాదరణమే అని గుర్తింపబడింది.[16]

తిరుప్పాణ్ హరిజనుడైనా మాధవునకు అతనికి మధ్య మలినమనేది లేదు అనే విషయం నాటకంలో చెప్పబడింది. కాబట్టే "దేవునికంటని మైల దేవాలయమున కంటదు" (నాటకం. పుట : 49) అనే వాస్తవమైన సత్యాన్ని

పేర్కొనటం కనిపిస్తుంది. అయినా, మత దురహంకారంతో ఉండే లోకసారంగ ముని శ్రీరంగనాథుడు చెప్పిన దాన్ని ప్రశ్నిస్తూ "మా నీతిని నీవు ప్రశ్నించరాదు. ఇది లోకాచారము" (నాటకం. పుట : 53) అని అంధవిశ్వాసంతో చెప్పటం కనిపిస్తుంది.

మతం అనేది సంఘశ్రేయస్సుని కాంక్షించాలే కాని, సంఘంలోనివారికి ప్రతిఘటన కారాదు అనేది తెలుస్తుంది. కావున, "ఏ జాతి ప్రజల విషయములోనైన రాజకీయవికాసానికి ముందుగా మానసిక విమోచనం ఆత్మోత్తేజనం జరుగవలసి వుంటుందనడానికి అనేక ఉదహరణలు డా॥ బి. ఆర్. అంబేద్కర్ పేర్కొన్నారు"17 కాబట్టే "తిరుప్పాణ్ ఆళ్వార్ భగవంతునితో సమానముగా ఆలయమునందు వేంచేసి సేవలను పొందుచు భక్త జనమును తరింపజేయుచుండిరి"18 అని పేర్కొబడింది. తిరుప్పాణ్ నిర్మలిన మూర్తి. అతని పవిత్రత "జన్మవల్లకాదు కర్మవల్ల, పవిత్రతా పవిత్రతలు ప్రవర్తిల్లుట" (నాటకం. పుట 55) అనేది వ్యక్తమౌతుంది.

అటువంటి మత మౌఢ్యం గల లోకసారంగముని శ్రీరంగనాథుని సూక్తులవల్ల పరమ సత్యాన్ని గ్రహించి విచక్షణను పొందటం కనిపిస్తుంది. కావున పంచముడైన తిరుప్పాణ్ "నిత్యసూరి వర్గమునకు సంబంధించినవాడు. వైకుంఠమున సదావిష్ణు సేవచేయు నిత్యసూరులలో తిరుప్పాణ్ ఒకడు. తిరుప్పాణ్ ఆళ్వారు భగవదాంశుడు గాన నేను అనాదరించినది భగవంతునే - నేను రాతితో కొట్టినది ఆ దేవదేవునే - పాపిని. తిరుప్పాణ్ సామాన్య భక్తుడు కాడు. అయన ఆళ్వారు. తిరుప్పాణ్ నిద్రించుచుండెననియు, ఆతనిని నిద్ర లేపవలెననియు రాయి విసిరిన నేను నిద్రయందున్నవాడను. ధ్యానముననున్న తిరుప్పాణ్ నిజముగా ఎరుకలో నున్నవాడు. నా యట్టి మూఢునకు తెలివి గరుపుటకు వచ్చిన ఉద్ధారకుడు తిరుప్పాణ్. అతడు మాలవాడు కాడు. అతనికి దూరమై నేను మాలడనైతిని. దైవసన్నిధిన నుండుటకు అర్హతను నేను గోల్పోయితిని"19 అని లోకసారంగముని పశ్చాత్తాపం చెందటం కనిపిస్తుంది. కాబట్టి, మనసులో మాలిన్యాన్ని కడిగివేసుకున్న లోకసారంగముని భగవంతుని మాటలను గుర్తించి—

"అంటరాని వాని నటుమోసి తెచ్చెదన్
అవని చూడ గుడికి అందజేయ
అంటరాని వాని నంటుట యేమిటి?
ఎత్తుకొందు గుండె కొత్తుకొందు"[20]

అని తిరుప్పాణ్‌ని మోసి తీసికొని వస్తానని పరితాపంతో పలకటం అతని పరిశుద్ధాత్మని వెల్లడిస్తుంది. అందువల్లే "మలిన మనస్కుల భావనమే మలిన దేహము! నీది పరిశుద్ధ తేజము తిరుప్పాణ్!" (నాటకం. పుట 62) అని తిరుప్పాణ్‌తో చెప్పటం సంస్కరణను పొందిన అతని మనస్తత్వాన్ని వ్యక్తం చేస్తుంది. కాబట్టే, "పవిత్రులను అపవిత్రులుగా చూడలేను" (నాటకం. పుట 64) అని పేర్కొన్న దాంట్లో తిరుప్పాణ్ మానవతాగుణం వ్యక్తమౌతుంది. కావున గాంధీజీ "హరిజనుడనగా హరియొక్క జనుడని అర్థము"[21] అని చెప్పటం కుల మత సమాదరాన్ని వ్యక్తం చేస్తుంది.

సంకీర్తన గాన మాధుర్యంతో, శ్రీరంగనాథుని సేవలో వేదవేద్యుడు పేర్కొన్న—

"విష్ణుభక్తి మహిమ విశ్వ విశాలమై
వినగ కనగ నిపుడు వీలుకలిగె
భక్త జనుల కోర్కె పరమాత్మ రూపమై
అవని తేజరిల్లు ననుట జరిగె"[22]

అనేది తిరుప్పాణ్ విష్ణుభక్తి మహిమని, భక్తితత్పరతని, మత సామరస్యాన్ని వ్యక్తం చేస్తూ, భక్త జనుల కోర్కెలను తీర్చే పరమాత్మ రూపంగా, శ్రీరంగ నాథుని కీర్తిస్తున్నది.

లోకసారంగముని పరిణత మనస్కుడైన తరువాత, భుజాల మీద తిరుప్పాణ్‌తో ఆలయంలో ప్రవేశించిన తీరు-

"పాత సంప్రదాయ పరిణామ జీవమై
బ్రతుకుచుంటి వెలుగు వెతుకుచుంటి

> కొత్త దీప్తి వెలసి క్రొన్నెల తలదాల్చి
> సాగుచుంటి గుడిని క్రోగు చుంటి''[23]

అనేది పుణ్య మార్గాన్ని, సత్య మార్గాన్ని, దర్మ మార్గాన్ని, దివ్యాను
కలుగజేస్తున్న క్రాంతి మార్గం అనేది వ్యక్తమౌతుంది.

శ్రీరంగనాథునిలో తల క్రిందులుగా ఐక్యమైన తిరుప్పాణ్ ధన్యజీవి
దృష్టి ఉన్న ఆళ్వారు. కావుననే—

> ''మనుజుడైన వాడె నేడు మహిత శక్తియైన మాట
> అంటరానివాడె చూడు మునివాహనుడైన బాట
> మానవత్వ మిలను నేడు మాధవత్వమందగనుట
> తత్త్వమేమి? నిత్యమేమి? సర్వజగత్ సత్యమేమి?''[24]

అని పేర్కొన్నదాంట్లో అంటరానివాడు మునివాహనుడైనాడు. మాన
మాధవత్వమని సర్వజగత్ సత్యాన్ని చాటి చెప్పిన మహనీయుడు తిరు
ఆళ్వార్. తిరుప్పాణ్ పాణ్ కులంలో జన్మించినాడు. తిరుప్పాణ్ సంప్ర
ప్రతిఘటనకు ప్రతీకగా కనిపిస్తాడు. లోకసారంగముని శ్రీరంగనాథ దేవ
పూజారి. మునివాహనంగా కలవాడైన తిరుప్పాణ్ మునివాహనుడైనాడు.
నాథుడు ఈ నాటకంలో మత నేపథ్యంలో చైతన్యమూర్తి కాబట్టే ఇది సా
స్పృహ ఉన్న ప్రసిద్ధ నాటకంగా పేరుపొందింది.

## పాత్రపోషణం

నాటక శిల్ప సౌందర్యం ఎంత మనోహరంగా ఉన్నా, అందులో
ఆద్యంతాలు తీర్చి దిద్దబడకుంటే అది పాఠకుల హృదయాన్ని ఆకర్
కథా సన్నివేశ ఘటనా చాతుర్యం, రచనా రమ్యత తాత్కాలికమైన
కలిగించ వచ్చు కాని, మదిలో సదా మెదలెడు చక్కని పాత్రల సృష్టి
సరిపోలవు. అందువల్ల పాత్ర చిత్రణం నాటకాంగాలలో అత్యంత ప్రధా
నాటకంలోని వివిధ పాత్రల స్వభావ పరిణామ చిత్రణం నాటక సమ
సంపుష్టికి ముఖ్య కారణం. ''ఆరంభం నుండి సద్గుణ శోభితమైన

ఉన్నటులుండి దుష్టంగా ప్రవర్తించుటయు, అదే విధంగా దుష్ట పాత్ర తటాలున శిష్టంగా మారుట నాటకానికి అసహజతను కల్గించును. నాటక కార్యానికి గల ప్రాధాన్యం పాత్ర పోషణకు లేదనేవారున్నారు. అందరికిని తటాలున పైకి కన్పడునది కథా రమ్యత. కాని, కథా నిర్మాణం, సన్నివేశాలు మొదలైనవి పాత్ర చిత్రణంతో సమ్మిళితం చేయకున్నచో నాటకం చాలా పేలవంగా కన్పిస్తుంది"[25] అని పేర్కొబడింది.

అరిస్టాటిల్ పండితుడు నాటకంలోని ఇతివృత్తానికి ప్రథమ స్థానం, పాత్రలకు ద్వితీయస్థానం ఇచ్చాడు. ఇతివృత్తంలో కార్యం ప్రాధాన్యాన్ని వహించటం వల్ల అదే ముఖ్యమని, పాత్రలు తరువాత పరిగణింపదగినవి అని అతని భావం. కానీ, హడ్సన్ అలాకాక పాత్ర చిత్రణ కూడ నాటకంలో అత్యధిక ప్రాధాన్యాన్ని కలిగి ఉంటుందని చెప్పాడు. మొత్తంమీద ఇతివృత్త మెంత ప్రధానమో పాత్ర చిత్రణం కూడ అంతే పాధాన్యాన్ని వహించటంలో సందేహమక్కర లేదు. పాత్ర చిత్రణ ప్రాముఖ్యాన్ని చెబుతూ హెన్రీ అర్థర్ జోన్స్ "ఇతివృత్తం, అనేక సన్నివేశాలు ఉన్నంత మాత్రాన ప్రయోజనం లేదు. వాని ననుసరించి పాత్ర చిత్రణ, ముఖ్యంగా పాత్రల శీల స్వభావాలను వ్యక్తం చేసినప్పుడు మాత్రమే నాటకం రాణిస్తుంది. ఉత్తమ నాటకానికి పాత్ర చిత్రణ అపరిహార్యమైన గుణం"[26] అని పేర్కొన్నారు.

నాటక పాత్ర చిత్రణలో తదేకధ్యాస విధిగా ఉండవలసిన గుణం. అనుచితాలను పరిహరించి సముచిత రీతిని పాత్రల సంవాదం నాటకంలో ఉండి తీరాలి. పాత్ర తీరుని వెల్లడిస్తూ "పాత్రల సంవాద మందలి ప్రతి పదం అర్థవంతం సాభిప్రాయమునై పాత్రల శీల స్వభావాలను అభివ్యక్తం చేయునదై ఉండాలి. వస్తువు ననుసరించి పాత్ర ఉండాలి. నాటక మందలి నాయకుడు లేదా ప్రధాన పాత్ర గుణాలను స్పష్టపరచునట్టి సంభాషణా సమన్వితమై నాటక కార్యం ప్రభావిత మొనర్చునట్టిదిగా ఉండాలని ప్రొఫెసర్ టోల్‌మన్ అభిప్రాయం"[27] అని పేర్కొన్నారు.

మునివాహనుడు నాటకంలో కథాగమనానికితోడుగా పాత్రచిత్రణ ఏ విధంగా జరిగిందో పరిశీలించాలి.

## తిరుప్పాణ్ :

కథానుగుణంగా, కథాగమనానికి అనువుగా భక్తి ప్రపత్తి, సహనం, శాంతస్వభావం కల పాత్ర తిరుప్పాణ్. ఆళ్వారుల తత్త్వాన్ని ప్రతిబింబించే పాత్ర తిరుప్పాణ్. పంచమ కులజాడైన తిరుప్పాణ్ ఆలయప్రవేశం కోరడం అది ఆనాటికి ఒక విప్లవం ఏనాటికైనా తన కోరిక నెరవేరుతుందనే నమ్మకం అతనికి ఉంది. "ఏనాటికయినా నీకు దయ కలుగుననియు, నా కాలయ ప్రవేశము జరుగుననియు తెలియును" (నాటకం - పుట : 12) అని తిరుప్పాణ్ అంటాడు. అనుకుంటే తిరుప్పాణ్ ఆలయ ప్రవేశం చేయగలడు. అతనే స్వయంగా "కానీ, పోవుట నా కసాధ్యము కాదు. నన్నెవ్వరావలేరు. నా రంగడు నన్ను రమ్మన్న నన్నాపువారెవరు?" (నాటకం - పుట : 13) అంటాడు.

ద్వితీయాంకంలో వేదవేద్యుడు "అరాట మధికమైన కావేరి ఊరుకొనునా? వరదై దేవాలయమును ముంచెత్తి తీరును" (పుట : 18) అని నదీ పరంగా చెప్పినా, తిరుప్పాణ్‌ని దృష్టిలో పెట్టుకొనే అంటాడు. కాని,తిరుప్పాణ్ ఆ విధంగా చేయడు. సంప్రదాయాన్ని మన్నించి, వారిని ఒప్పించి తన కోరిక నెరవేర్చుకోడానికి పూనుకొంటాడు. అందుకే "....కానీ, మీ అనుమతి అర్థించుచున్నాను" (పుట : 13) అంటాడు. ఇది అతనిలోని సంస్కారానికి నిదర్శనం.

నాటకంలోని కథ కూడా ఇదే ధ్యేయంతో నడుస్తుంది. తిరుప్పాణ్‌ను మునీశ్వరులు ఆలయ ముఖద్వారంవద్దనుండి పొమ్మనగా "యాచకుని పొమ్మందురా?" అంటాడు. మునీశ్వరులు రాతితో కొట్టినా, ఈసడించుకొన్నా, చివరకు శ్రీరంగనాథుని దయవల్ల ఆలయ ప్రవేశంచేసి అతనిలో లీనమవుతాడు. భక్తికి కుల మతాలు లేవని నిరూపిస్తాడు. ఈ రీతిగా ఈ పాత్ర ప్రయోజనం నాటకంలో కనిపిస్తుంది.

## లోకసారంగముని :

శ్రీరంగంలోని శ్రీరంగనాథ దేవాలయ అర్చకుడు సనాతన భావాలు కలవాడు. శ్రీరంగనాథుని భక్తుడు. నియమనిష్ఠలు కలవాడు. పంచమకులజుడని తిరుప్పాణ్‌ను ఆలయంలో ప్రవేశించడాన్ని నిషేధిస్తాడు. దాతితో కొట్టి బాధి

స్తాడు. "పంచముని పాదధూళితో పవిత్ర దేవాలయమును మైల పడరాదు" అంటాడు (పుట : 13). పంచముడు తపస్సు చేయరాదంటాడు. వానికా యోగ్యత లేదంటాడు. చివరికి శ్రీరంగనాథుడే తిరుప్పాణ్ భక్తిని గురించి చెప్పినా వినడు.

లోకసారంగముని, నాటకంలో శ్రీరంగనాథునితో జరిగిన సంభాషణ తరువాత, తిరుప్పాణ్ భక్తిని తెలుసుకొంటాడు. మొదట్లో "పంచమ స్పర్శ ప్రాణాంతక మే" అనినా (పుట : 54) చివరికి "మలిన మనస్కుల భావనమే మలిన దేహము! నీది పరిశుద్ధ తేజము తిరుప్పాణ్!" అని అంటాడు. (పుట : 62.) లోకసారంగముని మలిన మనస్కుడే కాని, మానవతా దృక్పథం లేనివాడుమాత్రం కాడు.

## వేదవేద్యుడు - దేవదత్తుడు :

ఇవి రెండూ కల్పిత పాత్రలు. వీటిని ఒక ప్రత్యేకమైన దృష్టితో ప్రవేశపెట్టినట్లు కనిపిస్తుంది. వీరిరువురు తిరుప్పాణ్, లోకసారంగముని ప్రతినిధులుగా ఉంటారు. అంటే - వారి భావాలను గౌరవించేవారుగా ఉంటారు.

ఏదైనా ఒక పాత్ర గొప్పదనాన్ని చెప్పాలంటే పాత్ర తనంతట తానే చెప్పుకోవటం ఉచితంగా ఉండదు. కవి కల్పించుకొని చెప్పలేడు. కాబట్టి, ఈ రెండు పాత్రలు కల్పింపబడ్డాయి. మత మౌఢ్యానికి దేవదత్తుడు, సాత్త్వికతకు వేదవేద్యుడు కల్పించబడిన పాత్రలు. నాటకంలో కొంతవరకు ఈ రెండు పాత్రలు కలిసి విష్కంభాదుల ప్రయోజనాన్ని సాధించాయని చెప్పవచ్చు.

## కావేరీనది :

మునివాహనుడు నాటకంలో కావేరీనది ఒక ప్రత్యేకతను సంతరించుకొంది. దీని ప్రథమ ప్రయోజనం శ్రీరంగేశునికి అభిషేక జలమిచ్చుటయే. ప్రతిరోజూ క్రొత్త నీటిని ఇవ్వటానికి పంచకళ్యాణివలె పరుగులిడుతూ ప్రవహిస్తుంది. ఇది శ్రీరంగేశుని భక్తురాలు.

రెండవది మునులవారు అభిషేకజలం తెచ్చిన రేవులో కూర్చోవటానికి కావేరీనది అవకాశం కల్గిస్తుంది. ఇక మూడవది "వెదకువాడు వెదకబడు చున్నాడు" (పుట : 30). వెదకువాడు అనగా శ్రీరంగనాథుని వెదకువాడు తిరుప్పాణ్. ఈ తిరుప్పాణ్ లోకసారంగమునిచేత వెదకబడుచున్నాడు. కావేరీ నది లేనిచో వెదకువాడు వెదకబడడు.

వేదవేద్యుని మాటలను పరిశీలిస్తే "కావేటి ఒడ్డు ఎప్పుడును మహర్షులను ఆహ్వానించుచునే ఉండును కదా!" (పుట:18) అని అనటం, భావిలో తిరుప్పాణ్ గొప్ప భక్తాగ్రేసరుడు అనే విషయం ఈ నదీప్రస్తావనమూలంగా తెలుపబడింది.

నాటకంలో పాత్రలన్నీ ఏదో కొంత ప్రయోజనాన్ని సాధించి నిష్క్రమిస్తాయి. ఇది పాత్రలను ప్రవేశపెట్టడంలోని ప్రయోజనం. నాటకంలో కావేరీ నది తన వంతు ప్రయోజనాన్ని సాధించి ఒక పాత్రగా కనిపిస్తుంది.

## శ్రీరంగనాథుడు :

ఈ పాత్ర నాటక ఫలసిద్ధికి తోడ్పడేదిగా ఉంది. నాటకాన్ని పరిశీలిస్తే తిరుప్పాణ్ ఆలయ ప్రవేశాన్ని కోరుకొంటాడు. ఈ కోరిక తీరడానికి అవసరమైతే, ఎదిరించడానికి కూడా సిద్ధపడతాడు. కాకపోతే, కొన్ని సంప్రదాయ పరిధులకు లోబడి ఉంటాడు.

ప్రథమాంకంలో "కాని, పోవుట నాకసాధ్యము కాదు. నన్నెవరాపలేరు. నా రంగడు నన్ను రమ్మన్న, నన్నాపువారెవరు? కానీ, మీ అనుమతి అర్థించుచున్నాను'' (పుట : 13) ఈ మాటలలో పై విషయం స్పష్టమవుతుంది.

ఇక లోకసారంగముని ధర్మకర్త, అర్చకుడు, గొప్ప భక్తుడు. కులాచార సాంప్రదాయబద్ధుడు. అస్పృశ్యవాది. తన పూజ స్వామికి ప్రీతికరమని, తనకు మోక్షం లభిస్తుందని మనస్ఫూర్తిగా నమ్మినవాడు. అయితే, తన్నుగూర్చి గొప్పగా భావించటం, ఎదుటివారి గొప్పగుణాల్ని గుర్తింపలేకపోవటం, హింసాప్రవృత్తికి పాల్పడటం అనేవి ఇతనిలోని పెద్ద లోపాలు.

పై రెండు పాత్రలు పరస్పరం విరుద్ధభావాలు కలిగి ఉన్నాయి. ఇక నాటక ఫలసిద్ధి ఏ విధంగా కలుగుతుంది? ఈ సందర్భంలో శ్రీరంగనాథుడు ప్రవేశించి, లోకసారంగమునితో వాదించి, అతని అంగీకరింపచేయటం కనిపిస్తుంది. అప్పుడే నాటక ఫలం సిద్ధిస్తుంది. ఈ ప్రయోజనం శ్రీరంగనాథుని ద్వారా కలగడం ఈ పాత్ర అస్తిత్వానికి ప్రయోజనం.

ఇలాగ కథ, కథానుగుణంగా సన్నివేశాల కూర్పుతో, పాత్రల చిత్రీకరణతో దివ్యమై రమ్యమై సహృదయ హృదయాలకు ఆనందాన్ని, అహ్లాదాన్ని కలిగించేదిగా ఉంది.

## రసనిర్వహణం

సాధారణంగా కావ్యాలలో ప్రధాన రసం, నవరసాలలో ఒకటి ప్రాధాన్యం వహిస్తుంది. సామాన్యంగా శృంగారం, వీరం, కరుణం, అద్భుతం, హాస్యం అనేవి అంగి రసాలుగా కావ్యాలలో కనిపిస్తాయి. అయితే వీరం, శృంగారం కావ్యాలలో ప్రాధాన్యాన్ని పొందాయి. భవభూతి ఉత్తర రామాయణం నిర్మాణంలో "ఏకోరసః కరుణ ఏవ నిమిత్త భేదాత్...."[28] అని పేర్కొన్నాడు. రామాయణంలో ధర్మవీరం అనేది అంగిరసంగా పేర్కొబడింది.[29]

భారతంలో శాంతరసం అంగిరసంగా కొందరు విమర్శకులు పేర్కొన్నారు.[30] అయితే సాహిత్య లోకంలో శాంత రస సమీకరణ వాదం, శృంగార రస సమీకరణ వాదం, కరుణరస సమీకరణ వాదం, అద్భుత రస సమీకరణ వాదం అనేవి ప్రసిద్ధి పొందాయి.[31]

నాటకంలో కూడ అంగి రసాలుగా శృంగార, కరుణ, అద్భుత, శాంత రసాలు కనిపిస్తాయి. వీరం, ధర్మ వీరం కొన్ని నాటకాలలో ప్రాధాన్యం వహిస్తున్నాయి. శృంగారం అనేది నాయికా నాయకుల కథా చిత్రణాన్ని బట్టి ఉంటుంది.

'మునివాహనుడు' నాటకంలో రచయిత "నాటకంలో శృంగారం కాని, వీరం కాని అంగిరసం కావాలని అర్యోక్తి. నాటకాంగిరసంగా భక్తిని అంగీకరిం

పకపోయినా, అది రసమే కాదన్నా, దాని ఉనికికి భంగం లేదు. శృంగారం స్త్రీ పురుష విషయకమేనని సిద్ధి ప్రసిద్ధి. శ్రీరంగనాథుడు శృంగారనాయకుడుగా కనిపించే సందర్భంగా తిరుప్పాణ్ భక్తి నాయికారూపం ధరించే అవకాశం ఎవరైనా భావింపవచ్చు"[32] అంటారు.

తిరుప్పాణ్ నవవిధ భక్తులలో ఒకడుగా కనిపిస్తాడు. భగవంతుని సంకీర్తన గానంతో మైమరచి తన్మయత్వంచెందే మహాభక్తుడుగా కనిపిస్తాడు.[33] పంచముడైనా పంచమునుల స్వరం, భక్తిపారవశ్యం కనిపిస్తుంది.

భక్తి కోకిల గానంలాగ పంచమస్వరం మైమరపింపజేసింది. అందువల్లే శ్రీరంగనాథ దేవాలయ ముఖద్వారంవద్ద పద్మాసనుడై తిరుప్పాణ్-

"సరేలేరా రంగనాథా సత్యవాక్యము తెలుపుమా

.... .... .... ....

.... .... .... ....

సరే లేరా పెద్దదొరవే హృదయతాపము తీర్చురా"[34] అని భక్తిపారవశ్యంతో పరమోత్కృష్టంగా మధురంగా పాట పాడటం కనిపిస్తుంది. కాబట్టే, అతడు మహాగాయకుడు. చదువు సంధ్యలులేని మధుర కవితా స్రష్ట. సరిగమలు రాని అస్పృశ్యుడు. శ్రీరంగనాథుని కనులార చూడని మధుర భక్తుడు. 'తిరుప్పాణ్ పాట గాలి పాటలాగ గాలికి పోవలసినదే' అని చెప్పినదాంట్లో సర్వత్రా వ్యాపిస్తుంది అనేది తెలుస్తుంది.

భక్తి పదుకొండు రూపాలుగా కనిపిస్తున్నది.[33] మధురభక్తి అనేది భగవంతుని పరమపురుషుడుగాను, భక్తుడు శృంగారనాయికగాను భావిస్తూ తన్మయత్వం చెందటం దీంట్లో కనిపిస్తుంది. వీరభక్తి మానవులకు దయాగుణం ఉండాలని, అది అభివృద్ధి చెందాలని ప్రతిపాదిస్తుంది.[35]

వైష్ణవమతం తెలుగుదేశంవరకు భక్తి సిద్ధాంతాన్ని మాత్రమే ప్రచారం చేసింది.[37]. భక్తులు మూఢభక్తితో తమ ఇష్టదేవతల్ని శరీర దృష్టితో భావించి వాళ్ళను వేరువేరుగా స్థిరపర్చుకోవటం కొన్ని కావ్యాలలో కనిపిస్తుంది. భగవంతుని శరీరాతీతంగా ఒక స్థితికే, తత్త్వానికే సంకేతంగా తీసుకొని వర్ణించిన భక్తి

సిద్ధాంతాన్ని ప్రతిపాదించే కావ్యాలలో దయాగుణం పరిధి ఎక్కువగా కనిపిస్తుంది. భక్తిని గురించి పేర్కొంటూ, ''మధుసూదన సరస్వతి యనెడి ఇంకొక మహానుభావుడు భక్తి యనెడి ఇంకొక రసమున్నదనియు, దానికి భగవంతుడే ఆలంబమనియు, భగవత్ సాక్షాత్కారమునకై భక్తుడు చేయు సాధనయందు కలిగెడి సుఖ, దుఃఖ, శంక, హర్ష నిర్వేదాదులు వ్యభిచారీ భావములనియు, ఇవి పరమానంద స్వరూపమగు భగవత్‌రతిగా పరిణమించుటకు సాధనములనియు నిర్దేశించి తమ భక్తికి రసత్వమును నిరూపింప పూనుకొనెను"38 అని తెలుపబడింది. దీంట్లో ప్రేమ, ప్రణయం లేదా వాత్సల్యం, ప్రీతి మొదలైనవి కనిపిస్తాయి. ప్రేమలేని భక్తి సాయుజ్య సుఖము నీయజాలదు.39 ప్రేమరహితుడైన భక్తుడు భగవంతునికి భయపడుతూ దూరంగా ఉండి తదనుగ్రహంకోసం నిరీక్షిస్తుంటాడు.

ప్రేమ సహితుడైన భక్తుడు భగవంతుని పాదాల్ని ముద్దిడుకొనుచుంటాడు. ఆయనచే ముద్దిడుకొనబడగోరుచుంటాడు.40 తిరుప్పాణ్ "భక్తి మాధుర్యము శబ్దగతముగావించి శ్రవణసుఖముగా గానముచేసి మైమరపించి, మైమరచి, ధ్యాననిష్ఠవలన బాహిరస్పృహలేకున్న ధన్యుడు" అని పేర్కొబడింది. (పుట : 11)

ఈ నాటకంలో శాంతరసం కొన్నిచోట్ల కనిపిస్తుంది. తిరుప్పాణ్ లోకసారంగమునితో "ఏనాటికైన మీకు దయ కలుగుననియు, నా కాలయ ప్రవేశము జరుగుననియు తెలియును" (పుట : 12) అనేది తిరుప్పాణ్ శాంతచిత్తతని వ్యక్తం చేస్తుంది.

ఈ నాటకంలో తిరుప్పాణ్ నాయకుడుగా, ధర్మవీరం అనేది కొన్ని కోణాల్లో పరిశీలిస్తే కనిపిస్తుంది. అయితే, నాయకుని విజయం, ప్రతినాయకుని అంతం అనేవి ఈ నాటకంలో కనిపించవు. అయినా, భక్తి ప్రధానమైన, ధర్మబద్ధమైన వీరంగల నాయకుడుగా శాంతచిత్తుడై తిరుప్పాణ్ కనిపిస్తాడు.

# భక్తిశృంగారం

భగవంతుని దివ్యనామాన్ని కీర్తనలలో చరణాంతంలోనుంచి సామూహికంగా కీర్తించటం కనిపిస్తుంది. వీటిని దివ్యనామ సంకీర్తనలు అని అంటారు.[41]

భగవంతుని తన్మయత్వంతో లీలారసానుసంధానము లీలగాన రూప సాధనగా మూర్తీభవిస్తుంది. ఇదే సాధకులకు నిత్యానందాన్ని కలిగించి, హృదయాకాశమున భగవంతుని సాక్షాత్కరింపజేస్తుంది. దేవదేవుడు నాయకుడుగా, భక్తుడు నాయికగా భావించుకొని, దివ్యసుందర రూప గుణాల్ని కీర్తన చేయటం దీంట్లో కనిపిస్తుంది. శృంగార భక్తిలో గానము సాధకుని అసమగ్ర సిద్ధికి, తన్మూలకమైన వ్యాకులతకు సంకేతముగా కనిపిస్తుంది.[42] శృంగార భక్తిలో నాయికా నాయకులను అలౌకిక స్థితిలోనే భావించటం కనిపిస్తుంది. ఇటువంటిది మధుర భక్తిగా పేర్కొబడింది.

'మునివాహనుడు' నాటకంలో అటనట తిరుప్పాణ్ భక్తి మధురభక్తికి నిదర్శనంగా కనిపిస్తుంది. శ్రీరంగనాథుడు నాయకుడుగాను, తిరుప్పాణ్ నాయికగాను కనిపించే స్థితి కొన్నిచోట్ల చూడవచ్చును. ఉదాహరణకు ప్రథమాంకంలో వేదవేద్యుడు లోకసారంగమునితో "భక్తి మాధుర్యము శబ్దగతము గావించి, శ్రవణసుఖముగా గానము చేసి, మైమరపించి, మైమరిచి ధ్యాననిష్ఠవలన బాహిర స్పృహ లేకున్న ధన్యుడు తిరుప్పాణ్" (పుట : 11) అని పేర్కొన్నాడు. ఈ విధంగానే ద్వితీయాంకంలో తిరుప్పాణ్ తపస్సమాధిలో—

"గుడిలో బందీవి నీవు
భక్తికి ఖైదీని నేను
నీవు నన్ను చేరలేవు
నన్ను గుడికి చేరనీరు"[43]

అని గానం చేయటంలో తిరుప్పాణ్ మధుర భక్తి వ్యక్తమౌతుంది.

ఈ నాటకంలో శాంత రసానికి అనుకూలించిన కొన్ని ఘట్టాలు కని పిస్తాయి. తిరుప్పాణ్‌లోని మానవత్వం భగవంతునియందు అనురక్తి, వేద వేద్యుడు పలికే మాటలు శాంతరసం అంగిరసం అనే భ్రమని కలిగిస్తాయి. ప్రథమాంకంలో వేదవేద్యుడు—

"భక్తియె రూపము దాల్చెనొ
ముక్తియె జగమున విలాస ముద్రలు కూర్చన్
యుక్తత దివిదిగి భువికగు
శక్తి తిరుప్పాణ్ ముఖాన శాంతత నిలుపన్''44

అని వేదవేద్యుడు పలికిన దాంట్లో తిరుప్పాణ్ శాంత స్వభావం వ్యక్తమౌతుంది. వేదవేద్యుడు లోకసారంగమునితో ''యమ నియమ దీక్షకులకు అరిషడ్వర్గాతీతు లకు చిత్తశాంతులకు దుఃఖసహిష్ణువులకు కదా పుణ్యభూమి లభించుట!''45 అని పేర్కొన్నదాంట్లో తిరుప్పాణ్ శాంత స్వభావం వ్యక్తమౌతుంది. పంచ మాంకం, ద్వితీయ రంగం చివరలో—

''సర్వజీవులెవడు సమముగా పరికించు
నతడె దివ్యుడతడె ఆత్మదీప్తి
సర్వసమత నెవడు సతతమ్ము కోరునో
అతడె పుణ్యుడతడె ఆత్మవేత్త''46

అని లోకసారంగముని పేర్కొన్నదాంట్లో శాంతరసం వ్యక్తమౌతుంది. ఈ విధంగా శాంతరసం అంగిరసం అనే ఆలోచనని కలుగజేస్తుంది.

## భక్తి - అంగిరసం

మునివాహనుడు నాటకంలో భక్తి అంగిరసంగా పేర్కొవచ్చు. ఇది భక్తివీరంగాను, కరుణంగాను, శాంతంగాను కొన్నిచోట్ల కనిపిస్తుంది.

ఈ నాటకంలో అంగిరసం క్రమానుగతంగా నిష్పన్నమవుతుంది. పూర్వా పూర్వ సంఘటనలు ఉత్తరోత్తర సంఘటనలతో సంవదిస్తూ, రసావిష్కరణం

ఉంటుంది. ఇది పాత్రగతంగా, కథాగతంగా, సన్నివేశగతంగా, దేనికదే విడిగా ఉండదు. వీటన్నింటి కలయికతో రసావిర్భూతి ఉంటుంది. రసభావం స్థాయి భావం, ఆలంబన, ఉద్దీపన, విభావాలతో, సాత్త్విక భావాలతో, సంచారీ భావాలతో క్రమక్రమంగా వికాసం పొందుతూ నాటకారంభంనుంచి అంతందాకా క్రమక్రమంగా వికాసం పొందుతూ వచ్చి, నాటకాంతంలో సంపూర్ణ రసానుభూతి కలుగుతుంది.

ఇంగ్లిషు నాటకంలో 'సబ్లిమేషన్' అనే పేరుతో రసానుభూతి ఉంటుంది. ఇది నాటకాంతంలో కలిగే మానసిక లక్షణంగా కనిపిస్తుంది. దీన్నే మన అలంకారికులు 'చిత్త వికారం' లేదా 'చిత్త వికాసం' అని అన్నారు. దీన్నే తరువాతి వారు రసంగా పేర్కొన్నారు.47

## భక్తి :

నారద భక్తిసూత్రములు అనే గ్రంథం "ఈశ్వరునిపట్ల గల పరమ ప్రేమే" భక్తి అని చాటుతుంది. ఇది అలౌకికమైనది. దైనందిన విధులకు అతీతమైనది. ''మానవుడు ఏ వస్తువును పొందిన సిద్ధుడు, అమృతుడు, తృప్తుడు అగునో అదియే భక్తి''48 అని పేర్కొబడింది. శాండిల్యుడు ''అనింజ యోని అధిక్రియతే పారంపర్యాత్ సామాన్యవత్'' అని పేర్కొన్నదాన్నిబట్టి "అంత్య జాతివారు మొదలుకొని ఉత్తమజాతివారివరకు, వారువీరనక ఎల్లరును భక్తి మార్గముకు ననుష్టించుటకు యోగ్యులే అగుదురు. భక్తజనపరంపరను జూచినచో నిది స్పష్టమగును. అహింసయు, సత్యమును, భగవద్భక్తియు నొకరి సొమ్ము గాదు. ఇవి సర్వసాధారణములు''49 అని పేర్కొన్నారు.

భక్తి ప్రపత్తులను కలిగిన అనేకమంది కనిపించుచున్నారు. వారిలో ''నందనారు, చోకమేలుడు, రవిదాసు, కన్నప్ప తిరుప్పాణాళ్వారు, తిరుమంగై ఆళ్వారు మున్నగు భక్తులెందరో యంత్యజాతివారు కలరు. మీరాబాయి, అవ్వైయ్యార్ అమ్మ, ఆండాల్ అమ్మ మున్నగు భక్తురాండ్రును కలరు. వీరెల్లరు భగవంతుని భక్తింగొలిచి కృతార్థత నొందిరి"50 అని తెలుపబడింది.

"తిరుప్పాణాళ్వారు దుర్మతి నామ సంవత్సర కార్తీక మాసము వృచ్చికా రాశి, రోహిణీ నక్షత్రమున ఉత్తైయూరిలో అంతిమ కులమునందు జన్మించెను. వీరు శ్రీవిష్ణు, శ్రీవత్సలాంఛన అంశమున జన్మించినారని భక్తుల భావము."[51]

''ఆళ్వారులు జన్మచే నెట్టివారయినను భగవంతుని బంధమువలన సర్వ బంధ విముక్తులయి వైష్ణవులయిరి. విష్ణు త్వాత్త్వంబునకు భేదము లేదు"[52] అని భక్తి విశేషాన్ని గూర్చి తెలుపబడింది. భక్తిని గురించి మహర్షులు అనేకమంది అనేక విధాలుగా చెప్పారు. భక్తిరసాయన, భక్తిసారామృత సింధువు, ద్రవిడోపనిషత్సార సంగ్రహం, భగవద్గీత మొదలైనవి భక్తితత్త్వాన్ని వివరించాయి. భక్తితోపాటు అనన్య భక్తి, పరాభక్తి మొదలగునవి పేర్కొనబడ్డాయి. భక్తునికి ముప్పది ఐదు లక్షణాలు ఉండాలి అని పేర్కొనబడింది.

భక్తి భావం రసం అవుతుందా? అనే విషయం గురించి ఆలంకారికులలో భిన్నమైన అభిప్రాయాలు ఉన్నాయి. ధనంజయుడు ప్రీతి, భక్తి అనేవి భావాలు గానే అంతర్భవిస్తాయని పేర్కొన్నాడు. భక్తి దేవతావిషయమైన రతి కాబట్టి, దీనిని భావముగానే ప్రాచీనులు పేర్కొన్నారు. కావున, ఇది రసత్వమును పొందదని వీరు పేర్కొన్నారు. అభినవ గుప్తుడు భక్తిని శాంతమునందు అంతర్భవింప జేశాడు.[53] మమ్మటుడు భక్తిని భావంగానే తలంచాడు. జగన్నాథుడు మొట్టమొదట భక్తికి రసత్వమును ప్రతిపాదించటానికి ప్రయత్నించి, తుట్టతుదకు నెమ్మదిగా జారుకొన్నాడు. అలంకారికులు చాలామంది భక్తిని భావంగానే తలంచారు. అది రసము కాదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చిరి.

రూపగోస్వామి ఉజ్వల నీలమణి గ్రంథంలోను, మధుసూదన సరస్వతి భగవద్భక్తి రసాయనం గ్రంథంలోను భక్తిని రసంగా పేర్కొన్నారు. "రూప గోస్వామి భక్తి రసమును మధురము, ఉజ్జ్వలము అని రెండు ముఖములుగా విస్తరించెను."[54] ఈతడు వాత్సల్యము, ప్రేమ, భక్తి అనువానిని అంగీకరించాడు. ప్రేమను (భక్తిని) అంగిరసంగా, శృంగారాన్ని అంగరసంగా పేర్కొన్నాడు.

మధుసూదన సరస్వతి శోక, క్రోధ, భయాదులకు వలె భక్తి రసం అవుతుందని పేర్కొన్నాడు. ఇతడు పేర్కొన్న "ఈ భక్తికి భగవంతుడే

ఆలంబము. తులసీ చందనాదులు ఉద్దీపన విభావములు, నేత్ర విక్రియాదులు అనుభావములు, నిర్వేదాదాదులు వ్యభిచారీ భావములు. భగవదాకారత స్థాయీ భావము"55 అని పేర్కొబడింది. కావున సుఖదుఃఖాదులకంటె అనిర్వచనీయమైన ఆనందం భక్తిరసంవల్ల చేకూరుతుందని తెలిపారు. అందువల్ల శృంగారాదుల కంటే భక్తిరసం సర్వోత్తమమైనదని మధుసూదన సరస్వతి పేర్కొన్నాడు. భక్తి ప్రధానంగా సాధన భక్తి, ప్రేమ భక్తి అని పేర్కొబడింది.

వైష్ణవ మతానికి చెందిన తిరుప్పాణ్ జీవితం, అతని ప్రబోధనలు, గీత మాధుర్యం భక్తితత్త్వవిలసితాలుగా కనిపిస్తాయి.

'మునివాహనుడు' నాటకంలో భక్తిరసం భక్తివీరం, దయావీరం, దాన వీరం, ధర్మవీరం, త్యాగవీరం అనే విధాలుగా కనిపిస్తుంది. పరిశీలనలో మునివాహనుడు నాటకంలో కనిపించే భక్తిరసం తీరుతెన్నులు పరికించవచ్చును.

"భగవంతుని యెడ మానవునకు గల భక్తి దాని దృఢరూపం ఆ ప్రేమ స్కంధమునుండియే ఈ శాఖ లన్నియు విడువడి వర్ధిల్లును"56 అని పేర్కొన్నారు. ప్రేమ లేని భక్తి సాయుజ్య సుఖమును ఇవ్వలేదు. "ప్రేమ కలిగిన భక్తుడు భగవంతుని పాదములను అర్చించి మధురాతిమధురమైన ప్రేమమిశ్రిత భక్తిని పొందును. భగవంతుడు తన కౌగిలిలో చేరునట్లు లేదా తాను ప్రేయసియై భగవంతుడు ప్రియుడుగా మారినట్లు మానసికమైన సంయోగ సుఖమును పొందును. ఆ స్థితిలోనే సాయుజ్యసుఖము, జీవన్ముక్తి అతనికి కలుగును. లోకాచారమునుబట్టి రసములు అనంతములు అను సూక్తిలో భక్తి వాత్సల్యాదులు కూడ దీనిలో చేరును"57 అని తెలుపబడింది.

## భక్తివీరం :

దీనికి భక్తితో కూడిన ఉత్సాహం స్థాయిగా ఉంటుంది. దీని స్వరూపం లోకోత్తరమైన భక్తికార్యాలను చెయ్యాలని స్థిరమైన యత్నసంకల్పంగా ఉంటుంది. అందువల్ల భక్తిరూపంలోకూడ నాయకునివలె, భక్తివీరాన్ని ప్రదర్శించినవారు కొందరు కనిపిస్తారు.

మునివాహనుడు నాటకంలో నాయకుడైన తిరుప్పాణ్‌లో కనిపించే భక్తిని ఈ విధంగా చూడవచ్చును.

ప్రథమాంకంలో నిర్మల భక్తితత్పరుడైన తిరుప్పాణ్ "ఏనాటికైనా మీకు దయకలుగుననియు నా కాలయప్రవేశము జరుగుననియు తెలియును.'' (పుట : 12) అని పేర్కొన్నదాంట్లో దృఢమైన భక్తితో "నా రంగడు నన్ను రమ్మన్న నన్నాపువారెవరు? కానీ మీ అనుమతి అర్థించుచున్నాను" (పుట : 13) అని ఆలయప్రవేశంగురించి చెప్పినపుడు భక్తిపీరం వ్యక్తమవుతుంది.

తిరుప్పాణ్ నియమనిష్ఠలు, భక్తితత్పరత ఆదర్శప్రాయములని—

"భక్తియె రూపము దాల్చనో
ముక్తియె జగమున విలాస ముద్రలు కూర్పన్
యుక్తత దివిదిగి భువికగు
శక్తి తిరుప్పాణ్ ముఖాన శాంతత నిలుపన్."58

అని భక్తిరూపం దాల్చి ముక్తి విలాస ముద్రలు కూర్చి దివినుండి భువికి అవతరించిన భక్తాగ్ర శిఖామణి తిరుప్పాణ్ అని, శాంత స్వరూపుడని పేర్కొబడింది.

తిరుప్పాణ్ సామాన్యులంటే అతీతుడని పేర్కొంటూ, అమేయమైన జ్ఞానసంపద కలిగినవాడని తెలుపుతూ వేదవేద్యుడు, "అది దైవేచ్ఛ - అనుగ్రహాగ్రహాల కతీతుడు తిరుప్పాణ్" (పుట : 34) అని అతని నిశ్చలమైన భక్తిని శ్లాఘించాడు.

శ్రీరంగనాథుడే తిరుప్పాణ్‌ను గూర్చి లోకసారంగమునితో "నా ధ్యానైక దీక్షాపరతంత్రుడు. భక్తిపరవశ్యుడు. నా కవి. నా గాయకుడు. నా నెచ్చెలికాడు" (పుట : 48) అని పేర్కొవటం కార్యసాధకుడైన తిరుప్పాణ్ అచంచల భక్తివిశ్వాసాల్ని వ్యక్తం చేస్తుంది.

హృదయభక్తిని పేర్కొంటూ లోకసారంగముని "భక్తి స్థిరమే! దేవుడే చంచలుడు! సుస్థిరుడు కాని దేవుడు మాకునంతే! భక్తి మారదు" (పుట : 52) అని పేర్కొన్నదాంట్లో సాధారణమైనరీతి వ్యక్తమైనా, తిరుప్పాణ్ యొక్క స్థిరమైన భక్తిరూపం వ్యక్తమౌతుంది.

లోకసారంగమునితో శ్రీరంగనాథుడు తిరుప్పాణ్ ధ్యానదీక్షవల్ల నిర్మలీమనమూర్తి అని పేర్కొంటూ "జన్మవల్ల కాదు, కర్మవల్ల పవిత్రతాపవిత్రతలు ప్రవర్తిల్లుట. తిరుప్పాణ్ పవిత్రుడు" (పుట : 55) అని పేర్కొన్నదానివల్ల చేసిన కర్మవల్లే పంచముడైన తిరుప్పాణ్ పంచమునిగా కీర్తింపబడతాడనేది వ్యక్తం అవుతుంది.

పంచమాంకంలో తిరుప్పాణ్‌తో లోకసారంగముని "నీవు భక్తుడవు - భగవంతుని దర్శించుట న్యాయమే! శ్రీరంగనాథుడు నిన్ను చూడగోరినాడు! అది ఆజ్ఞ!" (పుట : 64) అన్నదాంట్లో కథానాయకుడైన తిరుప్పాణ్ దృఢసంకల్పమైన శ్రీరంగని ఆలయ ప్రవేశమునకు అడ్డుగా నిలిచిన లోకసారంగముని, శ్రీరంగని ఆదేశంపై, ఆ కార్య నిర్వాహణకు పూనుకొనటం తిరుప్పాణ్ భక్తివీరానికి నిదర్శనంగా పేర్కొనవచ్చును అందువల్లే లోకసారంగముని "ఉచితానుచిత, పవిత్రతాపవిత్రత, ధర్మాధర్మకర్త శ్రీ మహావిష్ణువు. నాకేమి నిమిత్తము లేదు. నీవు చూచి బాధపడవలసిన దేదియును లేదు" (పుట : 64) అని పేర్కొన్నదానిలో భక్తివీరుడైన తిరుప్పాణ్‌కు భగవంతుడు చేరువైనాడనే విషయం వ్యక్తమౌతుంది.

వేదవేద్యుడు తిరుప్పాణ్ భక్తిగుణాల్ని కీర్తిస్తూ-

"తీవ్రభక్తి దీప్తి తేజరిల్లినచోట
కాలుమోపు చిన్న కన్నడతడు
మ్లానహీన దీన మానవదుఃఖమ్ము
విలయమొందజేయు విష్ణువతడు"59

అని పేర్కొన్నదాన్లో చిన్ని కన్ననివలె తీవ్రభక్తి కాంతి తేజరిల్లినట్లుగా, దీన మానవుల దుఃఖాన్ని అంతమొందించే విష్ణువులాగా, భక్తిగుణ సంపన్నుడై తిరుప్పాణ్ ఉన్నాడనేది తెలుస్తుంది.

భక్తి రసావతారం దాల్చినట్లుగా వ్యవస్థారూపంలో ఎన్నో తరాలుగా దేవుని సందర్శింపలేని జాతి ఆవేదన ఏకీకృతరూపంగా తిరుప్పాణ్ కనిపిస్తాడు. కాబట్టే, భగవంతుని చూచిన "ఈ భక్త్యావేశావేగమీఅస్థిపంజరము తట్టుకోలేదు దేవా!" (పుట : 69) అని లోకసారంగముని దేవదత్తులు పేర్కొన్నదాంట్లో రసావతారందాల్చిన తిరుప్పాణ్ భక్తిపీరం వ్యక్తమౌతుంది.

తిరుప్పాణ్ శ్రీరంగని దర్శించిన భక్త్యావేశంలో "ముల్లోకాలు దాటి, ఎల్లలోకాలు దాటి విశ్వాంతరాళాలకెగబ్రాకెడు విరాడ్రూపా! బ్రహ్మాది దేవ దేవతా పూజిత పాదపద్మా! శాతబాణ సంహృతరావణాసురా! పద్మశోద్యాన శ్రీరంగప్రభూ! నీ కింసుక చేలాంచలములో నా ధ్యానము లగ్నమయినది తండ్రీ!"[60] అని ధ్యానంలో నిమగ్నం కావటంతో అంతకాలం శ్రీరంగనాథుని కనులారా కనుగొన ఉవ్విళ్ళూరిన కోరిక నెరవేరింది. దేవదత్తుడు వేదవేద్యునితో భక్తితో ఐక్యమైన మహాభక్తుని గూర్చి పేర్కొంటూ "తిరుప్పాణ్ శ్రీరంగ నాథునిలో ఐక్యమయిపోయినాడు. ఈ భక్తుని నయనాలు భగవంతుని పాదాలలో ఐక్యమయిపోయినవి" (పుట : 82) అని పేర్కొన్నదాంట్లో తిరుప్పాణ్ శ్రీరంగనిలో భక్తిపీరంమూలంగా ఐక్యంకావటం తెలుస్తుంది.

వేదవేద్యుడు తిరుప్పాణ్‌ను పేర్కొంటూ "మానవుడే మాధవుడని నీ జీవితము మాకు బోధించినది. మేము ధన్యులమైతిమి!" (పుట : 83) అని దైవ జీవి తిరుప్పాణ్‌ను శ్లాఘించటం కనిపిస్తుంది.

లోకసారంగముని తిరుప్పాణ్ గురించి కీర్తిస్తూ—

''ఎవడు ప్రజలు మేల్కాంచ ప్రార్థించినాడో
ఎవడు జీవి చైతన్యమర్థించినాడో''[61]

అని తెలిపిన దాంట్లో నిర్మలమైన చిత్తముతో ప్రజలను మేలుకొలుపడానికి దైవాన్ని ప్రార్థించినాడు. జీవి చైతన్యాన్ని అర్థించినాడు. భువిలో సమదృష్టిని కలిగించినాడు. అటువంటి మహానరుడే భక్తిపీరంతో, దేవునితో సమానమైన భక్తిపీరంతో, దివ్యత్వాన్ని పొందగలిగాడు. తిరుప్పాణ్ కాంతి భూమికి

వెలుగునిచ్చి, శక్తినిచ్చి, భక్తితో జనులను కాపాడ గలుగుతుందని వేనోళ్ళ చాటి చెప్పాడు.

తిరుప్పాణ్‌లోని భక్తివీరం, భగవంతుని చేరుకొనే తపన భక్తిలో ఆఖరి దశగా పేర్కొవచ్చును. ఇది భక్తిలో పరాకాష్ఠస్థితి. ఇదే విషయాన్ని సూఫీ తత్త్వంలో పేర్కొంటూ–

"అబ్దెహఖిఖి కా అమల్ ఎహి యాఫ్ ఒ షహూద్ హై ఇసీ యాఫ్ ఒ షహుద్ కా నతీజా మహ్వియత్ ఫిజ్ జాత్ హై యాని జబ్ తజ్‌రీదే నఫ్సీ కె సాత్ ఇస్‌తెగ్‌రాహ్ ఫిల్ హఖ్ హోతో హువ్వల్ బాతిన్ కె ఆసార్ నమూదార్ హోతే హై ఏ ఫనా అల్‌ఫనా కా మొఖామ్ హై మహ్వియత్ హై ఇస్‌తర్‌దాద్ అమానత్ హై"62 అన్నారు.

'సూఫీ భక్తి కారణంగా భగవంతునికి చేరువై అతని దర్శిస్తాడు. భగవద్దర్శనంతో బాహ్యప్రపంచంయొక్క సంబంధం కోల్పోతాడు. సూఫీల భక్తి విషయంలో ఇది చివరి దశగా పేర్కొంటారు' అని పేర్కొబడింది. ఇదే విషయాన్ని పేర్కొంటూ "ఇస్లాము మత ప్రకారము దేవుడు ఒక్కడే, ఆయన అల్లా. అల్లా చండశాసనుడు. దయామయుడు. ఈ జన్మాన మనిషి చేసిన పుణ్య పాపాలకు ఖియామత్ నాడు న్యాయ విచారణ చేసి బహుమాన జరిమానాలను పంచి పెట్టుతాడు. మనిషికి శరణ్యం ఖురాను. ఇది అల్లా వాక్కు"63 అని పేర్కొబడింది. సూఫీ మధురభక్తిని పేర్కొంటూ -

"సూఫీ - అల్లాల సంబంధం ప్రేమాయణము. అత్యంతిక భక్తి. జీవాత్మ ఆషిఖ్ అనే ప్రియుడు, పరమాత్మ మాషుఖ్ అనే ప్రేయసిగాను, లేక జీవాత్మయే మాషుఖ్ అనే ప్రేయసి, పరమాత్మయే ఆషిఖ్ అనే ప్రియుడుగాను భావించడం కూడ కలదు. ఇది సూఫీ మధురభక్తి"64 అని పేర్కొబడింది. ఈ విధంగా ఇస్లాంలో మధురభక్తి దివ్యభక్తిగా కీర్తింపబడింది.

ఇదే విధానంలో క్రైస్తవమతంలోకూడ భక్తితన్మయత్వంతో భగవంతుని సన్నిధి చేరుకోవచ్చునని కీర్తింపబడింది. క్రీస్తు దేవదేవుని దివ్యనామ లీలల్ని స్మరిస్తూ తరించిన భక్తులు అనేకులు కనిపిస్తారు.65

ఆంధ్ర మహాభాగవతంలో భక్తిలో కనిపించే వివిధ రూపాల్ని భాగవత తత్త్వము- భక్తి అనే అంశంగా వివిధ స్థాయిలలో కనిపిస్తుంది. అయితే. దీంట్లో ''భాగవత నాయకుడు విష్ణువు''66 అనేది పేర్కొబడింది

మునివాహనుడు నాటకంలో తిరుప్పాణ్ విషయకంగా భక్తివీరమే అయాచోట్ల ఎక్కువగా కనిపిస్తుంది. ఈ నాటకంలో ''భక్తి ఉత్తమ ప్రేమ రూపం. పరతత్త్వ మందలి ప్రేమ అంటే భగవద్రతి, పరాభక్తి, దివ్యార్ద్రప్రేమ చిత్తవృత్తిగా కనిపిస్తుంది''67 అని పేర్కొన్నారు. భక్తుడు నాయికగా తన్మయత్వం చెందుతూ నాయకుడు భగవంతుడు శృంగారమూర్తి అని పేర్కొబడింది. కళాచిత్రణలో భక్తిశృంగారం సౌందర్యవస్తువులో భక్తిభావాన్ని అంగంగా చేసి ధర్మవీరాన్ని చిత్రించటం కనిపిస్తుంది. ఇది పురాణ మార్గంగా కనిపిస్తుంది. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో కూడ భక్తిశృంగారం ఉన్నతంగా కనిపిస్తుంది.

మునివాహనుడు నాటకంలో భక్తి ప్రత్తులతో ఉండి, పరమపదాన్ని చేరుకొనటం నాటకాంతంలో కనిపిస్తున్నది. వైష్ణవ మతతత్త్వం, అష్టవిధ భక్తి వర్ణనం, సంకీర్తనం మొదలైనవి తిరుప్పాణ్‌ని అంత్యజుడు అనే భావన పాఠకులలో తొలగిపోయేటట్లుగా చేశాయి. తిరుప్పాణ్‌లో ధర్మవీరం, దానవీరం, దయావీరం కొన్ని సందర్భాలలో ఉన్నా, భక్తివీరమే ఎక్కువగా కనిపిస్తుంది. శ్రీరంగనాథుడు భగవంతుని రూపంలో కనిపించే నాయకుడే అయినా, భక్తివీరం దృష్ట్యా తిరుప్పాణ్ నాయకుడుగా కనిపిస్తాడు. ''నే నిచ్చటనే అభిషేకజలము తీసికొనిపోక తప్పదు. ఓరీ కదలవు కదా? నీకిదే శాస్తి! (రాయి విసిరాడు)" (పుట : 23) ''శ్రీరంగనాథా! నీవు పంచములకు ప్రత్యక్షము కారాదు" (పుట: 47) అని పేర్కొన్నదాంట్లో ప్రతినాయకుని లక్షణం వ్యక్తమవుతుంది.

మునివాహనునిలో దయా, దాన, ధర్మ, త్యాగ, వీరాలతోపాటు భక్తివీరం పరాకాష్ఠలో కనిపిస్తుంది. స్థాయీభావాలు పైన పేర్కొన్నవి కనిపిస్తాయి. కాబట్టి, అంగిరసం భక్తివీరం అవుతుంది. కావున, మునివాహనుడు నాటకంలో నాయకుడు తిరుప్పాణ్, ప్రతినాయకుడు లోకసారంగమునిగా పేర్కొవచ్చు. తమిళదేశం భూమికగానూ, దివ్యక్షేత్రం శ్రీరంగం ప్రదేశంగానూ,

కావేరీనది రసపోషణకు కారణంగానూ, శ్రీరంగనాథుని దివ్యపురుషునిగానూ పేర్కొనవచ్చు. మత, సామాజిక, రస, కథావిషయంగా ఇది భక్తివీర ప్రధానమైన చారిత్రక నాటకంగా కీర్తిప్రతిష్ఠల్ని పొందింది

## పాదసూచికలు

1. భారతీయ తత్త్వశాస్త్రం - సమగ్ర పరిశీలన పుట : 119
2. పైదే పుట : 127
3. అన్నమాచార్య సాహితీ కౌముది పుట : 9
4. మునివాహనుడు నాటకం పుట : 8
5. పైదే పుట : 8
6. పైదే పుట : 13
7. పైదే పుట : 15
8. పైదే పుట : 8
9. పైదే పుట : 8
10. పైదే పుట : 15
11. పైదే పుట : 23
12. పైదే పుట : 22
13. పైదే పుట : 34
14. భారతీయతత్త్వశాస్త్రం పుట : 220
15. ఆంధ్రదేశంలో సంఘసంస్కరణోద్యమాలు పుట : 26
16. పైదే పుట : 136
17. కుల నిర్మూలన పుట : 21
18. ఆళ్వార్లు - అస్పృశ్యత
    తెలుగు సాహిత్యం - దళిత జనోద్ధరణ
19. ఆళ్వారుల దివ్యవైభవము పుటలు: 57,58
20. మునివాహనుడు నాటకం పుట : 57
21. హరిజనులు - వారి పుట్టుపూర్వోత్తరాలు పుట : 2

22. మునివాహనుడు నాటకం పుట : 65
23. పైదే పుట : 67
24. పైదే పుట : 74
25. నాటకాలోకము
26. కోలాచలం శ్రీనివాసరావు పుట : 215
నాటకసాహిత్య సమాలోచనము
27. పైదే పుట : 216
28. ఉత్తర రామ చరితమ్ పుట : 47
29. రసోల్లాసము పుట : 16
30. పైదే పుట : 27
31. పైదే పుట : 84
32. మునివాహనుడు నాటకం పుట : 79
33. ఆముక్తమాల్యద (మాలదాసరి కథ) పుట : 6-10
34. మునివాహనుడు నాటకం పుట : 6
35. నారద భక్తిసూత్రములు పుట : 300
36. తెలుగు కవిత - సాంఘిక సిద్ధాంతాలు పుట : 31
37. పైదే పుట : 27
38. సాహిత్య శిల్ప సమీక్ష పుట : 150
39. పైదే పుట : 152
40. సాహిత్య శిల్ప సమీక్ష పుట : 152
41. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవితచరిత్ర పుట : 66
42. అన్నమయ్య పుట : 23
43. మునివాహనుడు నాటకం పుట : 17
44. పైదే పుటి : 15
45. పైదే పుట : 38
46. పైదే పుట : 75
47. రచయితతో ముఖాముఖీ
48. తెలుగుకవులు - భక్తితత్త్వం పుట : 2

49. నారద భక్తిసూత్రములు పుట : 5
50. పైదే పుట : 6
51. ఆళ్వారుల దివ్యవైభవము పుట : 54
52. తెలుగు సాహిత్యం - దళిత జనోద్ధరణ
డా. బి. ఆర్. అంబేద్కర్ శత జయంతి
పత్రిక (ఆళ్వార్లు - అస్పృశ్యత)
53. తెలుగు కవులు - భక్తితత్త్వం పుట : 8
54. పైదే పుట : 8
55. పైదే పుట : 9
56. సాహిత్య శిల్ప సమీక్ష పుట : 150
57. పైదే పుట : 153
58. మునివాహనుడు నాటకం పుట : 15
59. పైదే పుట : 66
60. మునివాహనుడు నాటకం పుట : 69
61. పైదే పుట : 74
62. ఖురాన్ ఔర్ తసవ్వుఫ్ పుట : 97
63. సూఫీతత్త్వము - ఋతస్య పంథా పుట : 38
64. పైదే పుట : 39
65. బైబిలు - తెలుగుప్రతి పుట : 307
భక్తి కీర్తనలు
66. ఆంధ్ర భాగవత విమర్శ పుట : 252
67. భక్తిరసవాదం పుట : 31
పోతన పంచశతి స్మారిక

# 6. సాహిత్యంలో రచయిత స్థానం

లోకసారంగముని వాహనంగా కలవాడు తిరుప్పాణ్ ఆళ్వారు- ఈ నాటకంలో ప్రధానపాత్ర. ఈ పేరు ననుసరించి నాటక నామధేయం కూర్చబడింది. తిరుప్పాణ్ హరిజనుడు, పాణ్ కులస్థుడు కావటంవల్ల పన్నిద్దరాళ్వారులలో ఇతని చరిత్రనే ఇతివృత్తంగా ఎన్నుకోవటంలో రచయిత దృక్పథం వెల్లడవుతుంది. పాణ్ కులమనేది ఒకనాడు స్పృశ్యకులమే. అనంతర కాలంలో అస్పృశ్యకులంగా మారింది.[1] ఈ పాణ్ కులస్థులు సంగీతవేత్తలు, ప్రియులు, వాద్య సంచాలకులు, ప్రయోక్తలు, వీణావాదన నిపుణులు. ఆదిలో రాజస్థాన గౌరవాలు పొందారు. అప్పుడు అంటరానివాళ్ళు కారు. కాలం మార్పువల్ల వీరు అస్పృశ్యులయ్యారు. వీళ్ళల్లో భక్తాగ్రశిఖామణి, సంగీతవేత్త, గానమాధుర్యం-భక్తి మూర్తీభవించిన తిరుప్పాణ్ ఇతివృత్తం రచయితను ఆకట్టుకుంది. ఇదే నాటక రచనకు కారణమయింది.[2]

## సంప్రదాయ ప్రతిఘటనం :

ఈ నాటకంలో తిరుప్పాణ్, లోకసారంగముని రెండు దృక్పథాలకు ప్రతినిధులుగా కనిపిస్తారు. సంప్రదాయాన్ననుసరించే విధానంకు లోకసారంగ ముని, దాని ప్రతిఘటనకు తిరుప్పాణ్ ప్రతీకగా కనిపిస్తారు. సంఘర్షణ తీవ్రత ఈ ఇద్దరి మధ్య కనిస్తుంది. ఇది శ్రీరంగనాథుని బోధనల వల్ల శాంతి మార్గంలో, భక్తిపరాకాష్ఠలో పరిసమాప్తమవుతుంది.

## హరిజనుల ఆలయప్రవేశం :

వైష్ణవ భక్తితత్త్వం మూర్తీభవించిన సాంప్రదాయక, మిశ్రమ నాటకంగా ఇది రూపొందింది. ఈ కథని స్వీకరించటం తిరుప్పాణ్ కోసం, హరిజనుల కోసం అని గమనించాలి. ఈ నాటకంలో తిరుప్పాణ్ దేవాలయ ప్రవేశం ప్రధానాంశంగా కూర్చబడింది, ''హరిజనుడు దేవాలయంలో ప్రవేశించటం గూర్చి ఆనందముంది. ఏ మతభక్తి నాకు ప్రత్యేకంగా ఇష్టంకాదు''[3] అని

పేర్కొవటంలో రచయిత హరిజనోద్ధరణ సంకల్పం, హరిజనుల ఆ
ప్రవేశం ఉద్దేశ్యం వెల్లడి అవుతాయి.

## సర్వమానవ సమానత్వం :

మునివాహనుడు నాటకంలో భక్తి, మానవ సమానత్వం అనేది
మవుతుంది. తన్మూలంగా సర్వమానవ సమానత్వం నాటకంలో ప్రతిపా
దించింది.

## విశ్వశాంతి :

రచయితకు దీనిపైన ఉండే దృక్పథం వెల్లడవుతుంది. సం
ఏ రంగంలో అయినా శాంతి చోటు చేసుకొంటే, అందరూ హర్షించేదే.
లోనూ, మత విషయకంగా శాంతి ఏర్పడితే అది విశ్వశాంతికి మార్గం కా
ఈ నాటకం సూచిస్తుంది.

## సంప్రదాయ నాటకలక్షణం :

పద్యాలు, దానికితోడు తిరుప్పాణ్ భక్తిగీతి మాధుర్యాన్ని వెల్లడించ
పాటలు చోటు చేసుకొన్నాయి. నాటక రచన పూర్తిగా సలక్షణ ప్ర
భాషలో సాగినట్లుగా కనిపిస్తుంది. ఇది వ్యావహారికానికి దగ్గరగా ఉన్న ప్ర
రచనగా కనిపిస్తుంది. నాటక రచయిత ఇచ్చే సూచనలు వ్యావహా
కనిపిస్తాయి.

## పాశ్చాత్య నాటకలక్షణాలు :

దీంట్లో సంప్రదాయంతోపాటు, పాశ్చాత్య లక్షణాల సమ్మేళనం
కనిపిస్తుంది. అలాగే దృశ్య శ్రవ్య నాటకరీతుల సమన్వయం ప్రయోగ
పరిధిసమన్వయం కనిపిస్తుంది. సంభాషణల్లో నటనాంశముండే రీతి కని
పాటలలో పాటలాంటి పద్యం రీతి కనిపిస్తుంది. ముత్యాలసరాల అనుస
పద్యరచనలో కొన్ని సందర్భాల్లో సంప్రదాయాన్ని అతిక్రమించటం
కనిపిస్తుంది. రస నిర్వహణలో పాశ్చాత్య, సంప్రదాయ లక్షణ సమ్మేళ
పిస్తుంది.

## చారిత్రక నాటకరచన :

తిరుప్పాణ్ ఇతివృత్తాన్ని గ్రహించి సామాజిక స్పృహతో ఆధునిక పద్య, గేయ, సంభాషణా, నాటక శిల్పంతో, దృశ్య శ్రవ్యాత్మకంగా నాటకాన్ని తీర్చి దిద్దటం రచయిత నైపుణ్యమనే చెప్పాలి. నాటక రచయిత నటుడు, దర్శకుడు కావటంవల్ల నాటక రచనలోనే ప్రయోగంలో ఎదురయ్యే సమస్యల్ని పరి ష్కరించే ప్రయత్నంగా అంకం ప్రారంభం, ముగింపు సందర్భాలలో పాట, పద్య రచన చేయటం నూతన దృక్పథమని చెప్పవచ్చును.

## నాటకం చతుర్థాంకం ప్రాశస్త్యం :

సంప్రదాయవాదులు, ఆధునికులు, సామాన్య పాఠకులు విశేషంగా చతుర్థాంకంలో లోకసారంగముని, శ్రీరంగనాథుడు సంభాషణని నిశితంగా గమనిస్తారు. దీంట్లో దేవుడు-గుడి-భక్తి-మానవత్వం-మలినరహితుడు దేవుడు-వర్ణాశ్రమ ధర్మాలకు అతీతమైంది భక్తి మొదలైన విషయాలు చాలా నిశితంగా పరిశీలనం పొందుతాయి. అందువల్లే ఇది విజ్ఞుల మెప్పుని పొందింది.

అభ్యుదయ భావాలుకల రచయితగా నాటకకర్త కనిపిస్తారు. హరిజనో ద్ధరణం, సమ సమాజ లక్ష్యం, సమతావాదం, మతాతీతమైన వ్యవస్థా నిర్మాణ ధ్యేయం వీరిలో కనిపిస్తాయి. వర్గ సంఘర్షణ లేని శాంతి సమాజ స్థాపనం అంత ర్లీనంగా కనిపిస్తుంది. కులాతీత, మతాతీత, వర్గ రాహిత్య సమాజ ధ్యేయం వ్యక్తమవుతుంది. హరిజనుడు వైష్ణవభక్తి పరిపూర్ణుడైన మూఢాచార సంప్ర దాయవాదిని పశ్చాత్తప్తుని చేసి పరిశుద్ధాత్ముణ్ని చేయటం ఈ నాటకలో కని పిస్తుంది.

ప్రగతిశీల దృక్పథం కల రచయిత—

"కులము గోత్ర మంచు గోలపెట్టెడు జాతి
పెరగలేదు, గుండె పెంచలేదు
హెచ్చుతగ్గులందు పెచ్చు మీరెడు జాతి
మునగలేదు శాంతి కనగలేదు"[4]

అని ఆర్తితో పేర్కొవటం కనిపిస్తుంది. నాటకాంతంలో -

"ఈ తిరుప్పాణ్ ప్రకాశమే యిలకు మిగుల
నిలిచి శ్రీరంగనాథుండు వెలుగునట్లు
సర్వ సామాన్య మానవశక్తి పొంది
ప్రజల ప్రతినిధుల్ జనుల కాపాడుగాక!"5

అని పేర్కొవటంలో నాటక రచయిత సామాన్య మానవశక్తి
తమై, సౌఖ్యంగా విలసిల్లాలనే ఆకాంక్ష వ్యక్తమవుతుంది.

## నాటకసాహిత్యంలో రచయిత స్థానం :

ఆధునికుడుగా, అభ్యుదయవాదిగా, సంఘసంస్కరణ ద్యో
రచయితగా ఆచార్య కొలకలూరి ఇనాక్ కనిపిస్తారు. చారిత్రక, నాటక
అభ్యుదయ భావాల్ని వ్యక్తీకరించటం కనిపిస్తుంది. ఆధునికాంధ్ర
మీద వీరికి మక్కువ ఎక్కువ. అయినా, సంప్రదాయాన్ని పూర్తిగా వ
ధోరణి ఈ నాటకంలో కనిపించదు.

సంప్రదాయక రీతిలోనే ఈ నాటకాన్ని ఐదంకాలుగా కూర్చారు
పాశ్చాత్య నాటక లక్షణాలు కూడ రంగనిర్మాణం ఇత్యాదులలో
వచ్చును. పన్నిద్దరాళ్వారులలో ఒకడైన తిరుప్పాణ్ ఇతివృత్తాన్ని
దాయక రీతిలో పద్యాలు, పాటలు, సరళగ్రాంథికంలో నాటకంగా
చూడవచ్చు. అంగి, అంగ రస నిర్మాణం, నాటక ప్రయోగరీతి ఈ
గమనించవచ్చు.

తెలుగు నాటక సాహిత్యంలో ప్రముఖులు అనేకులు కనిపిస్తార
దాయ, అభ్యుదయ ధోరణులలో రచనలు చేసినవారు అనేకులు
కందుకూరి, చిలకమర్తి, కాళ్ళకూరి, వేదం, తిరుపతి వేంకటకవులు,
వంటివారు ఉత్తమ రచనలు సంప్రదాయబద్ధంగా వెలువరించారు.
ఆత్రేయ, భమిడిపాటివంటివారు సాంఘిక నాటకాలు అభ్యుదయ పథ
దిద్దారు. డా॥ కొలకలూరి ఇనాక్‌గారి 'మునివాహనుడు' నాటకం దృ

త్మకమైనది. సరళ గ్రాంథిక నిర్మాణరీతిలో విలసిల్లుతూ ఉంది. తక్కువ పాత్రలతో, స్త్రీ పాత్ర ప్రమేయం లేకుండా, సంప్రదాయక రీతిలో, వైష్ణవ భక్తితత్త్వ ప్రతిపాదికంగా నిర్మింపబడింది.

ఇటీవలి నాటక రచయితలు ఈ నాటకంలో గుర్తించదగ్గ ప్రముఖమైన అంశాలు:

1. సంగ్రహ సమగ్ర ఇతివృత్త స్వీకారం
2. తక్కువ పాత్రలతో నాటక సృష్టి.
3. మనో వైజ్ఞానిక శిల్పం.
4. తక్కువ పరిధిలో వర్ణనలు.
5. సన్నివేశాలలో అంతర్లీనంగా సంఘర్షణ కూర్పు.
6. సంభాషణలలో చిన్న చిన్న తెలుగు పదాల పొందిక.
7. సరళగ్రాంథిక సంభాషణలు - వ్యావహారికస్ఫోరక రచనారీతి.
8. ఆధునిక గేయ రచన (ముత్యాలసరాల ఛందస్సు)
9. సంప్రదాయ ఛందోరీతిలో వ్యతిక్రమణం.
10. అంగిరస శిల్పంలో నవ్యత్వం.
11. అంకప్రాధాన్యం, రంగవిభజనం.
12. పంచమాంకాలు, పూర్వ, ఉత్తర రంగ విభజనం.
13. సబ్లిమేషన్, రస నిర్వహణం.
14 మానవాభ్యుదయం, విశ్వశాంతి, మత సమన్వయం.
15. దళిత జనోద్ధరణం - మొదలైనవి.

ఇటీవలి, ఆధునిక దృక్పథం కల నాటక రచయితలు, వీరి నాటకంలో కనిపించే కొన్ని గుణాలతో అయినా నాటకాలు నిర్మిస్తే, సంప్రదాయంలోని అంధత్వం తొలగిపోయి, నవ్యత్వంతో పాటు క్రాంతిదర్శనత్వం కూడ సిద్ధిస్తుందని చెప్పవచ్చు. ఆధునిక తెలుగు నాటక సాహిత్యంలో ఈ నాటకం మూలంగా రచయిత కొంత సమున్నత స్థానాన్ని పొందగలిగారని నాటక వైశిష్ట్యం, బహుమతి పురస్కార గౌరవం మొదలైనవి వేనోళ్ళ చాటి చెబుతున్నాయి. అందువల్లే 'మునివాహనుడు' నాటకం ఆంధ్ర సాహిత్యలోకంలో ఇంకా ఉన్నత శిఖరాలను చేరుకోగలదని ఆశించవచ్చు.

# పాదసూచికలు

1. నాటకం - ఉన్నమాట పుట : 77
2. పైదే పుట : 80
3. రచయితతో ముఖాముఖి
4. మునివాహనుడు నాటకం పుట : 75
5. పైదే పుట : 76

# ఉపసంహారము

ప్రథమాధ్యాయంలో తెలుగు నాటక వికాసం, వైవిధ్యం విషయాల వివరణం ఉంది.

ద్వితీయాధ్యాయంలో రచయిత ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి జీవిత దర్శన సంగ్రహ వివరణం పేర్కొబడింది.

తృతీయాధ్యాయంలో మునివాహనుడు నాటకంలోని సాంప్రదాయక, పాశ్చాత్య నాటక లక్షణాల సమన్వయం, చారిత్రక నాటకవిశేషం పేర్కొబడ్డాయి. భాషా ఛందో వైవిధ్య విశేషాలు, సంభాషణా రీతి వివరించటం ఉంది.

చతుర్థాధ్యాయంలో మునివాహనుడు నాటకంలోని మత విశేషం, పాత్ర పోషణం, రస నిర్వాహణం వివరించటం ఉంది. అంగిరసంగా భక్తివీరాన్ని, అంగరసాలుగా భక్తిశృంగారం, దయావీరం దానవీరం ధర్మవీరం, త్యాగ వీరం వివరణం ఉంది.

పంచమాధ్యాయంలో నాటక రచయిత దృక్పథం అనుశీలనం ఉంది. తెలుగు నాటక సాహిత్యంలో రచయిత స్థానాన్ని నూతన అంశాల విషయాలు సంగ్రహంగా వివరించటం ఉంది చివరగా మునివాహనుడు నాటక పరిశోధనంలో ఆవిష్కరించిన నూత్నాంశక్రోడీకరణం ఉపసంహారంగా ఉంది.

మునివాహనుడు నాటకం తెలుగు సాహిత్యంలో, రచనలో, దృశ్య శ్రవ్య విధానంలో ప్రభావం చూపటంలో ప్రత్యేకతని సాధించింది. పాఠ్యగ్రంథంగా ఈ నాటకం విస్తృత ప్రచారం పొందింది. ముఖ్యంగా బాలబాలికల్ని, అధ్యాపకుల్ని, అభిజ్ఞుల్ని అభ్యుదయమార్గంవైపు మళ్ళించటానికి కారణమైంది.

ఇతివృత్తం చారిత్రకమైనా, సామాజికులలో కొత్త ఆలోచనలకు
అయ్యింది. ఆంధ్రదేశమంతటా అధికప్రేరణకు నేపథ్యం అయ్యింది.

ఈ నాటక సాహిత్య సృష్టి సాంఘికంగా ఇంత ప్రాధాన్యం
కోవటానికి దృశ్య శ్రవ్య విధానమే కారణం అని చెప్పవచ్చును. '
నుడు' సాహిత్యంలో సాధించిన వైశిష్ట్యం నిరూపించటానికి ఉద్దిష్టమైన
శోధన, ఆంధ్ర నాటకరంగ ప్రత్యేకత దర్శించటానికి నూతన సోపా
తుంది. ఈ నాటకం సంఘ సంస్కరణం, మానవతావాదం నేపథ్యం
జనోద్ధరణకు అత్యంత దోహదకారి కాగలదు.

అనుబంధం :

# ఉపయుక్త గ్రంథసూచి


1. అన్నమయ్య, డా. ముట్నూరి సంగమేశం, యువభారతి, ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాద్.

2. అన్నమాచార్య సాహితీ కౌముది, డా. ముట్నూరి సంగమేశం, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

3. ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు, ఆచార్య వి. రామకృష్ణ, అనువాదం : రాచమల్లు రామచంద్రారెడ్డి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హిమయత్ నగర్, హైదరాబాద్ - 500 029.

4. ఆంధ్ర భాగవత విమర్శ, డా. ప్రసాదరాయ కులపతి, ఆంధ్ర సంస్కృత శాఖాధ్యక్షులు, హిందూ కళాశాల, గుంటూరు - 522003.

5. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము, చలమచర్ల రంగాచార్యులు, 1-9-25/8, శ్రీనివాస విలాసము, విద్యానగరము, హైదరాబాదు - 7.

6. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయము - ప్రయోగము, డా. సి. నారాయణ రెడ్డి, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాద్. (ద్వితీయ ముద్రణ) సెప్టెంబర్ 1977.

7. ఆముక్తమాల్యద, వేదం వేంకటరాయశాస్త్రి, వేదం ప్రెస్, మద్రాస్-1.

8. ఆళ్వారుల దివ్యవైభవము, తిరువాయిపాటి రాఘవయ్య, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1980.

9. ఆళ్వారులు - దివ్య ప్రబంధములు, వరదాచార్యులు ధనకుదరం, కౌముది గ్రంథమాల, గుంటూరు - 1, 1970.

10. ఆళ్వార్లు - అస్పృశ్యత (వ్యాసం) తెలుగు సాహిత్యం - దళిత జనోద్ధరణ యు.జి.సి. జాతీయ సదస్సు, డా॥ బి. ఆర్. అంబేద్కర్ శతజయంతి ప్రత్యేక సంచిక, డిసెంబర్ - 1990.

11. కుల నిర్మూలన - డా॥ బి. ఆర్. అంబేద్కర్, అనువాదం -డా. బోయి భీమన్న, బుక్ ట్రస్ట్, వివేకనగర్, హైదరాబాద్ - 500 020, నాల్గవ ముద్రణ - 1990.

12. కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య సమాలోచనము, డా. ఎస్. గంగప్ప, నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2, 1977.

13. ఖురాన్ ఔర్ తసవుఫ్, డా. మీర్‌వలి ఉద్దీన్, హైదరాబాద్ - 1945.

14. తెలుగు కవిత - సాంఘిక సిద్ధాంతాలు, డా॥ ముదిగొండ వీరభద్రయ్య, తెలుగు అకాడమీ, హైదరాబాద్, ద్వితీయ ముద్రణ-1990.

15. తెలుగు నాటకం, డా॥ ఎస్. గంగప్ప, శశి ప్రచురణలు, సి/73, శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు-522006, డిసెంబర్, 1985.

16. తెలుగు సాహిత్య వికాసం, డా॥ కె. కె. రంగనాథాచార్యులు, ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్‌రోడ్డు, హైదరాబాదు.

17. తెలుగు కవులు - భక్తితత్త్వం, డా॥ మహతీశంకర్, న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ, ప్రథమ ముద్రణ-1984.

18. నాటక వికాసం, డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు, డా॥ పి. సాంబశివరావు, 306-307, సీమ్‌కర్ బ్లాక్స్, చిక్కడపల్లి, హైదరాబాదు-20.

19. నూరేళ్ళ తెలుగు నాటకరంగం, ఆచార్య మొదలి నాగభూషణశర్మ, తెలుగు విశ్వవిద్యాలయం, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు.

20. నాటకాలోకము (ధర్మవరము రామకృష్ణమాచార్యుల నాటక పరిశీలనము), రచన : డా. సాధన పీరాస్వామి నాయుడు ఎమ్.ఏ, పిహెచ్.డి. తెలుగు ఆచార్యులు, శ్రీ వెంకటేశ్వర కళాశాల (ఎ), తిరుపతి, సాధనా పబ్లికేషన్స్, 554 ఆర్. ఆర్. కాలని, తిరుపతి, 1984.

21. నారద భక్తిసూత్రములు, దొడ్ల వెంకటరామరెడ్డి, కావలి.

22. భక్తిరసవాదం, ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు, పోతన పంచశతీ స్మారిక, పోతన భాగవత పంచశతీ మహోత్సవ సమితి, వరంగల్లు.

23. భారతీయ తత్త్వశాస్త్రము, ఏటుకూరి బలరామమూర్తి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్, ఏడవ ముద్రణం - ఏప్రిల్ - 1989.

24. భారతీయ తత్త్వశాస్త్రం - సమగ్ర పరిశీలన, ఆచార్య గూడ సుందర రామయ్య, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1988.

25. బైబిలు (పరిశుద్ధ గ్రంథము), బైబిలు సొసైటీ ఆఫ్ ఇండియా, 206 మహాత్మాగాంధీ రోడ్, బెంగుళూరు - 560 001, 1990.

26. మునివాహనుడు. ఆచార్య కొలకలూరి ఇనాక్, రవీంద్ర పబ్లిషింగ్ హౌస్, గుంటూరు - 522 003, తృతీయ ముద్రణ - 1987.

27. రసోల్లాసము, డా. జి. వి. సుబ్రహ్మణ్యం.

28. సాహిత్యదర్శిని, సాహిత్య వ్యాసాలు, ఆచార్య కొలకలూరి ఇనాక్, జ్యోతి గ్రంథమాల, 129, తపోనగర్, అనంతపురం - 515004. 1985.

29. సాహిత్య భావలహరి, ఆచార్య ఎస్. వి. జోగారావు, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1989.

30. సాహిత్య శిల్ప సమీక్ష, పింగళి లక్ష్మీకాంతం. శ్రీ బాలాజీ పబ్లిషర్స్, బజారు వీధి, తిరుపతి, ద్వితీయ ముద్రణ - 1970.

31. సూఫీతత్త్వము - ఋతస్యపంథా, సర్దేశాయి తిరుమలరావు, భారతి, (సాహిత్య మాసపత్రిక - నవంబరు 1989)

32. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర- వచన రచన, డా. కేశర్ల వాణి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1990.

33. హరిజనులు-వారి పుట్టు పూర్వోత్తరాలు, గోవాడ నిరీక్షణరావు,భాగ్య ప్రచురణలు, మచిలీపట్నం, కృష్ణా (జిల్లా) ప్రథమ ముద్రణ - ఫిబ్ర 1985.

